ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీశ్రీశ్రీశ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభువేనమః

శ్రీ శివరామ దీక్షిత అచలగురు పీఠాధిపతులగు

శ్రీ మద్రాజాది రాజ రాజయోగీంద్ర శ్రీ మద్భాగవత

శ్రీ కృష్ణ దేశికేంద్రుల విరచిత

"శుద్ధ నిర్గుణ తత్వ కందార్థదరువులు" అను

గ్రంథము నందలి శ్రీవారి నిర్దేశిత "అచలగురు దీక్షితుని

(శిష్యుని)" సాంప్రదాయ ధర్మములు కర్మములు, మరియు

నిత్యనైమిత్తికముల తెలుపు

# అచలగురు మార్గము

అను సేకరణ గ్రంథము

సేకరణ :-

## అ ప నిజానంద తులసీదాసు

గ్రామం : (బెన్నూరు)

సవరణ కర్త :

సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి - అధ్యక్షులు

శ్రీమత్కోల్హాన లక్ష్మణదేశిక అచలగురు మందిరము

సీతాఫల్‌మండి, సికింద్రాబాద్

★ మొదటి ముద్రణ:-
స్వస్తి శ్రీ ప్రమాధి నామ సం ర మాఘ శుద్ధ (11) ఏకాదశి,
మంగళవారము,
తేది. 15-2-2000.
కాపీలు (1000)
★ అన్ని హక్కులు రచయితవి.

మూల్యము - రూ లు 25.-
ప్రచురణ కర్త:- అ ప నిజానంద తులసీదాసు - (ఔన్నారు)
★ ముద్రణ:-
శ్రీ ఉదయ ప్రింటర్స్
నారాయణగూడ
హైదరాబాద్

★ గ్రంథ ప్రాప్తి స్థానము :-
1. "సిద్ధాచల గురు మందిరము"
గ్రా గుముడాల
మం దోమ
జిల్లా రంగారెడ్డి (ఆం. ప్ర)
పిన్ - 509339.

2. అ ప నిజానంద తులసీదాసు
C/O యస్. రాచప్ప
ఇం. నెం. :5-1-200 స్టేట్ బ్యాంక్ ఎదురుగా
షాహుకార్ పేట్ - తాండూరు.
మండలం : తాండూరు
జిల్లా : రంగారెడ్డి (ఆం. ప్ర)
పిన్ : 501141.

అచల గురు అంజిలయ్యస్వామి [illegible]వ

వార్షికారాధన గురుపూజ మహోత్సవ సందర్భమున

**సమిష్టి బోధానంద శిష్యులచే కృష్ణయ్యాత్రి**

(లాలాపేట, సికింద్రాబాద్) గారిచే "**అచలగురు మార్గము**"

అను ఈ గ్రంథము ఆవిష్కరింపబడియెను.

స్వస్తిశ్రీ ప్రమాధినామసంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి (11)

మంగళవారము

తేది: 15-2-2000.

**సిద్ధాచల గురుమంటపము**

కుముడాల (గ్రామము)

దోమ (మండలం)

రంగారెడ్డి (జిల్లా) ఆం.ప్ర

ఓం

శ్రీ సద్గురవేనమః

# శుభ ఆశీర్వాదములు

పరమ పావన హృదయులై, గురుభక్తి తత్పరులై, సుజన సంఘమునకు కల్ప తరువులై, ఆదర్శనీయులై, అమితానంద పరులై ఈ గ్రంథమును రచించిన మా యొక్క ప్రియ శిష్యులు, నిజానందపరులు, గురు కరుణ బడసి, గురు కృపకు పాత్రులై గురు ధ్యాన నిమగ్నులై, చదువరు లెల్లరకు శాంతి సౌభాగ్యములు గలుగజేయు ఈ గ్రంథ రాజమును వ్రాసినందులకు ఆ చంద్రార్కముగా వారి యొక్క గురుభక్తి ప్రకటమగు గాక అని ఆశీర్వదిస్తున్నాను.

(ప్రమాధి నామ సం.ర. పుష్య శుద్ధ షష్ఠి

బుధవారము -13-1-2000)

అ ప సిత్యానంద కృష్ణాచల ప్రభు

సిద్ధాచల గురు మందిరము

గ్రా. గుముడాల, మం. దోమ

జిల్లా : రంగారెడ్డి (ఆం.ప్ర)

ఓం

శ్రీ సద్గురవేనమః

# ఆశీర్వచనములు

శ్రీమద్బృహద్వాసిష్ఠ శిద్ధాంత నిర్ధారణోద్ధారకులు శ్రీ మద్రామడుగు శ్రీ శివరామ దీక్షిత అచల గురు సాంద్రాయక పరంపరలో మహాయోగిని శేషమాంబ గారు నొకరు. వీరి పారంపర్యులలో నొకరగు అ ప శ్రీ కస్సా సిద్ధాచల స్వామి శిష్యులైన శ్రీ నిత్యానంద కొమ్మూరు క్రిష్ణదాసు గారి ప్రియ శిష్యులైనశ్రీ నిజానంద తులసీదాసు బెన్నూరు గ్రామము, యాలాల మండలం, రంగారెడ్డిజిల్లా, గారు వ్రాసిన ''అచలగురువమార్గవము'' గ్రంథమును ఆసాంతము చూచితిని. అందులో పొందు పరచిన నియమములు ధర్మ మర్మములు శృతి, స్మృతి యుక్తముగా శిష్యుని వుత్తీర్ణుని చేసి దృఢపరచుటకు అనువుగా కూర్పు చేయుట జరిగినది. మరియు కందార్థములలోని సూక్తులను విశదీకరించుట సాంప్రదాయ విస్తరణకుఉపయోగపడునని భావించి -చిన్నవయస్సులో అనేక గ్రంథముల ఉపనిషత్తుల పరిశోధన అనుభవము కలిగి దానిని అచల సాంప్రదాయ అభివృద్ధికై వినియోగించినట్లుగా యీ గ్రంథమే మనకు ఉదాహరణ. ఇకముందు వీరి ద్వార ఇంకా అనేక విమర్శనాత్మకరచనలువెలువడ గలవని ఆశిస్తూ వారిని సద్గురు మూర్తి సర్వకాల సర్వావస్థలయందు రక్షిస్తూ జననమరణ భ్రాంతి రహిత స్థితిని కుదురు పరచ ప్రార్థిస్తూ ఆశీర్వదించు చున్నాను.

సమిష్ఠి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి

(లాలాపేట, సికింద్రాబాదు)

ఓం
శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీశ్రీశ్రీ శ్రీధర శివరామ దీక్షిత అచల గురుపీఠ పరంపరాచార్యులు, శ్రీ సిద్ధాచల గురు మందిరము (గుముడాల గ్రామం). గురుపీఠ అధ్యక్షులైన శ్రీశ్రీశ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభువుల వారి ప్రియ శిష్యులైన అ ప నిజానంద తులసీ దాసు గారు (బెన్నూరు వాస్తవ్యులు). వారు అచల బోధ సిద్ధాంతముల నాధారముగా జేసుకొని అచలగురు మార్గంబను, ఈ గ్రంథారాజమును సేకరించి,ఆధ్యాత్మ చింతనాపరుల కత్యంత ఉపయోగకరమై, ఆచరణాత్మకముగా నుండు నట్లు వ్రాసినారు. చాలాసంతోష దాయకము. కవులను వర్ణించుటకు మా తరము గాదు, కానివారు దయార్థ హృదయులు, ఈ లోకమునకు సూర్యుని వంటి వారు.వారి పలుకులే పలుకులు, వారివిచారణయే విచారణ వారిభక్తియే భక్తి, వారి శ్రమయే శ్రమ, వారిలో ఉన్న గురు భక్తియే వారి జన్మ సార్థకమునకు దోహద పడుచున్నది. గురు పరమాత్మ కృపచే వారియొక్క కోరిక నిర్విఘ్నముగా కొనసాగినందులకు గురుమూర్తిని సదా ప్రార్థిస్తూ అభినందనలు తెలియజేస్తున్నాను.

(ప్రమాధి నామ సం.ర. పుష్య శుద్ధ షష్ఠి
బుధవారము - 13-1-2000)

ఇట్లు
నిత్యానంద కుర్మాచల ప్రభువుల వారి
ప్రియ శిష్యులు అ ప సమరసానంద తిరుపతయ్య
గ్రా: కుస్మ సముద్రం, మం: కులక్చర్ల జిల్లా : రంగారెడ్డి (ఆం.ప్ర)

శ్రీ శ్రీధర స్వాముల వారి ప్రియశిష్యులు



శ్రీ మద్రాండగు శివరామ దీక్షితులవారు

శ్రీమత్పరమహంస సీతారామస్వాముల వారి
ప్రియ శిష్యులు



శ్రీమద్భాగవత కృష్ణదేశి కేంద్రుల వారు

శ్రీమత్ పరుశురామ సీతారామ స్వాముల
వారి (సోదరి) ప్రియ శిష్యురాలు



శ్రీ శేషమాంబ గారు

శ్రీమత్ మామిల కృష్ణమాచార్యుల
ప్రియశిష్యులు



శ్రీమత్ సిద్ధాచల దేశింద్రులవారు.

శ్రీమద్ సిద్ధాచల దేశికేంద్రుల వారి

ప్రియశిష్యులు



అచలగురు అంజిలయ్య స్వాములవారు

శ్రీమద్ సిద్ధాచల దేశికేంద్రుల వారి

ప్రియ శిష్యులు



శ్రీ నిత్యానంద కుంభాచల ప్రభువుల వారు.

శ్రీమద సిద్ధాచల దేశికేంద్రుల వారి
ప్రియ శిష్యులు



శ్రీనిత్యానంద కృష్ణాచల ప్రభువుల వారు

అచలగురు అంజిలయ్యా స్వాముల వారి
ప్రియ శిష్యురాలు



శ్రీమతి అచల ఋషి పద్మమ్మగారు

అచలగురు అంజిలయ్య
స్వాముల వారి ప్రియ శిష్యులు



శ్రీమతి బసమ్మ గారు (అనుపూర్)

ఆచలగురు అంజిలయ్య వారి
ఏకైక పుత్రుడు



శ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభువుల
వారి ప్రియశిష్యులు
అ॥ వ॥ శ్రీ వెంకటయ్యగారు

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీశ్రీశ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభుమహారాజ్‌కీ జై

# దాసస్తుతి

స్వగురుమూర్తికి:-

పరిపూర్ణ పరబాహ్య స్వరూపా, బయలను పర బ్రహ్మ స్వరూపా, సాక్షాత్ త్రిమూర్త్యాత్మక స్వరూపా, అహంరహిత పదార్థ సిద్ధి ప్రదాయకా, అజ్ఞాన తిమిరాంధకార వినాశకా, ఆది మధ్యాంతశూన్యా- అండపిండ బ్రహ్మాండావరణ ఛేదకా, అనాథరక్షకా, ఆశ్రిత పారిజాతమా- చలాచలరహిత స్వరూపకా, మునిగణ వినుతాయ, ముముక్షురక్షకాయ, మోక్ష ప్రదాయకాయ, పరమ భాగవతోత్తమా, ఓ సద్గురు స్వామీ ! నిజగురు స్వామీ ! శ్రీ గురు స్వామీ ! మీ ప్రియ పుత్రుడు తులసీదాసుని ద్వాదశ సాష్టాంగ ప్రణామములు, కోరిన తడవే కోర్కెలు దీర్చే నిజగురు స్వామీ ! తను మన ధనంబులు ధారబోసిన వానికి (శిష్యునకు) ప్రణామంబులు చేయు శుద్ధ యెరుక యైనా శ్లేషించెగదా యని కోపగించకు తండ్రీ సర్వము (ఆవరణాంతర్గత శరీరం) గురు మయమనినిశ్చయమొంది, అందలి అహము (గురువాక్యరూప) సైతం గురు ప్రసాదముగా భావించి, యా అహం రహితమున్నకై, శుద్ధాశుద్ధ జ్ఞాన భేద వర్జితంబును కాంక్షించిన వాడనై, చంచలుడనై, ఈరచనకు పూనితినే కాని, అచల పదవి నుండి "జార" నిచ్ఛగించగ నెంచలేదు.

ఓ కృపాళూ! ఈ దీనునిపై 'కని' 'కర' ముంచి క్షమించి పరిపూర్ణాశీశ్శులుఅందజేయ గలందులకు గాను, అరూపుడైన, అహ

రహితుడైన, అచలుడైన, అశరీరుడైన, అనామకుడైన, లేని "తులసీ దాసుడు" వేడియు, వేడకనే వేడుచున్నాడు.

సర్వం నిజగురు చరణారవిందార్పణ మస్తు.

**అచలగురు అంజిలయ్య స్వాములకు :-**

శ్రీ కరులు, శుభకరులు, సద్గురు స్వరూపులైన అచల గురు అంజిలయ్య స్వామి దివ్య పాదపద్మంబులకు అహం రహిత ద్వాదశ నమస్సులు, గురుదేవా ! మీదివ్యాశీస్సుల వల్లనే కదా మీ క్షేత్రంబును దర్శించు భాగ్యము గలిగెను. మీ కృప వల్లనే గదా భక్తకోటి సమస్తము పరిచయమాయెను. మీ వీక్షణంబుల వల్లనే గదా సకలార్రిష్టంబులు దొలగెను. మీ ఆశీర్వనంబు వల్లనే గదా ఈ పుస్తకము రూపు దాల్చినది., మీ దివ్య తేజస్సు వల్లనే గదా మాకు స్వస్థత చేకూరినది, గురుదేవామీకృపా కటాక్షములు మాపై యెల్ల వేళలా ఉండుగాకఅని వేడుచున్నాము.

**సద్గురు స్వరూపులకు :-**

మద్గురు స్వరూపులైనసద్గురు అ ప. సమిష్ఠి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి (లాలాపేట -సికింద్రాబాద్)నాయన గారి దివ్య పాదంబులకు ద్వాదశ నమస్కారములు. కోరినదే తడవుగా మాపై అనుగ్రహించి, మాయీ "అచలగురు మార్గము" అను గ్రంథమును సవరించిరి, మరియు ఆ కరుణామయులు బ్రహ్మానంద స్వరూపులై మముగాంచి "నిజానంద" అనుదీక్షిత నామ ప్రధానంచేసి,మానామంబును " అ ప నిజానంద తులసీదాసు" అను సంభోదనతో దీవించిరి. అట్టి పరిపూర్ణగురు పుంగవుల యేమని నుడివిననూ కొదువేయగును. ఆ కరుణామయ గురుమూర్తికటాక్షవీక్షణంబులుమాపై యెల్లవేళలా ప్రసరించు గాక యని వేడుచున్నారము.

మరియు నిర్మలమైన ఆనందస్వరూపులు, బ్రహ్మానందపరులును యగు సద్గురు అ ప నిర్మలానంద కాడిగె నారాయణ నాయన పాదారవిందములకు ద్వాదశ వందనములు . ''మా'' యొక్క ''అచల భజనలు -కీర్తనలు. తత్వములు అను సంపుటిని మాపై ప్రేమతో సవరించి, సరియైన మార్గదర్శనం చేసి, యెన్నో యుక్తులుజెప్పి ఆశీర్వదించిన సద్గురు మూర్తికి అహం రహిత నమస్సులు.

సద్గురు స్వరూపులు, ద్వంద్వాతీతులు, సమరసజ్ఞాన సంపన్నులు, మా సహోదరులు నైన అ. ప సమరసానంద తిరుపతయ్య నాయన గారి పాదపద్మంబులకు శిరసావహించి ద్వాదశ నమస్సు లర్పించుచున్నాను. పరమ దయాళువు, పరోపకార పరాయణుడునైన అట్టి గురుమూర్తి మాపై అత్యంత వాత్సల్యముతో తమ వ్యావహారిక పనులెన్నిటినో త్యజించి మాకు సంపూర్ణసహకారమునందించిన పరమోత్తములు. వారిని వారి గుణౌన్నత్యమును వర్ణించనాకు నలవి కాకున్నది. గురుదేవా . మీకృపా కటాక్షములు మాపై ఎల్లవేళలా ప్రసరించు నట్లుగ దాసుడు మరీమరీ వేడుచున్నాడు.

**చదువుల తల్లికి :-**

అమ్మా. దివ్య మంగళ స్వరూపిణీ, .వీణాధారిణి . వేదభూషిణీ !సమస్య విద్యల సారమయీ. బ్రహ్మ పట్టపురాణీ ! సరస్వతీ దేవీ ! నాపై పుత్రవాత్సల్యమును జూపి, కరుణించి, నా తప్పులను సరిజేసి నన్నను గ్రహించుము తల్లీ . నీవు నాహృదయాంతరాళముల యందు బ్రహ్మవిద్యనావిర్భవింప జేసి లోక కళ్యాణార్థమై అట్టివిద్య నిరంతరముగా లోకమందు ఈదాసుని ద్వారా ప్రసరింపజేయుము తల్లీ .అమ్మా! పరమానంద స్వరూపిణీ నీ పుత్రుని ఆశీర్వదించుమమ్మా.

**కవిపండితులకు :-**

దివ్యజ్ఞాన సంపన్నుల్లారా ! లోకహిత కారణులారా. వాగ్దేవి మానసపుత్రులారా ! పండితోత్తములారా ! నన్ను మనసారా క్షమించండి. పురాణేతిహాసంబులు చదువకనే, చందశ్శాస్త్రంబులు చూడకనే,తర్క, వ్యాకరణాది మీమాంసశాస్త్రంబులు అభ్యసింపకనే నేను ఈచిన్న పుస్తకమును పరిపూర్ణ గురు స్వామియైన మద్గురు మూర్తి ప్రసాదమైన ''గరువాక్య'' జాగృత జ్ఞానంబుచే మేల్కొన్న వాడనై చేసితినే గాని, యేదో తెలిసెనని అహంకరించ లేదు. దయామూర్తులారా ఈ అజ్ఞానిని జ్ఞానిగా తీర్చిదిద్ది ఆశీర్వదించ వేడుచున్నారము.

**గురు పుత్రులకు, భక్తవరులకు :-**

పరిశుద్ధాత్మ స్వరూపులారా ! దివ్యజ్ఞాన సంపన్నులారా ! అహం రహిత పదార్థ కాంక్షితులారా . నన్ను దీవించండి, తానేదో తెలిసెనని అహంకరించి గ్రంథరచనకు పూనెనని కోపగించవలదు నాయనలారా ! నా స్థిర సంకల్పమును దీవించి, సంపూర్తి యగునట్లనుగ్రహించి ఆపై నన్ను అశరీర పదవికింగొనుపొండు. మహనీయులారానేనే అస్థిరుడను మరినేనేమిచేయంగలను. అయినా నాలోని యీజ్ఞానవెంవరిది. సద్గురుప్రసాదము గదా. మరి అట్టి,ప్రసాదమును గురు పుత్రులు తిరస్కరించ నెంచరు గదా. గురు వాక్యపాలననేపరమావధియని తలంచిన నేను ఈ కార్యమును (గ్రంథరచనను) గురు కార్యముగానే భావించితిని. గాని స్వకార్యముగా గాదు. కావున మీ ఆశీశ్శులు పొందుటకు నేను అర్హుడనియే భావించి, నన్నాశీర్వదించుమని మీపాదపద్మంబులకు శత సహస్ర వందనము లర్పించుచున్నాను.

ఓ సాధు పుంగవులారా ! పరమ భాగవతోత్తములు శ్రీమద్భాగవత్

క్షేత్రదేశ కేంద్రులు ఆశీర్వదించి

**కందార్థము :** యెవరుంటె యేమిభయముర ! సవరింతురు తప్పులుంటె సాధులు విన్నన్ సవరించ నివ్వమిది విని ! యవనీతులు నిందజేస్తె అయ్యేదేమోయీ అందులో మనదిపొయ్యే దేమోయీ భవనాశ స్థితి లేని పద్ధతియీ బోధ చౌరంగ వినిపించు చాటేలవూటేల అయ్యేదేమోయీ అందులో మనది పొయ్యేదేమోయీ !

అని ఉద్దీప్తుని జేసినట్లుగ మీరును నిజగురు సాంప్రదాయ ధర్మ విస్తరణ కాంక్షులను మనసార దీవించగలరని మీ చరణంబుల చెంత మోకరిల్లుచున్నాను.

**జననీ జనకులకు :-**

అమ్మా ! (అంజిలమ్మ), నాన్న (వడ్ల లక్ష్మప్ప) లారా !' విశ్వకర్మ కుల దీపికలారా ! మీ ప్రియ, కనిష్ఠ పుత్రుడు ( నిజానంద తులసీదాసు ), ఇహలోకమునందు ఏకాకిగా ఎన్నడును లేడమ్మా, బంధు జనంబులు విరోధించినా, సర్వమును త్యజించి సద్గురు నిత్యానంద కృష్ణాచల ప్రభు పాదపద్మములే సర్వస్వమని నమ్మి, సచ్చిదానంద స్వరూపుడై, బ్రహ్మానంద స్వరూపుడై యున్నాడు. పరలోకగతులైన మీ ఆత్మలకు పరమ శాంతిని చేకూర్చ గలందులకు సద్గురు మూర్తి పాద పద్మంబులకు నే ప్రణమిల్లుచున్నాను. నా యీ రూపంబును సృష్టించిన మీరు 'నా' కాది దంపతుల సమానులే కాని అన్యులు గారు. దైవాంశ సంభూతులారా. మీ కిదే నమస్సుమాంజలులు. మీబిడ్డను పరిపూర్ణునిగ అనుగ్రహించండి.అమ్మానాన్నలారాసాకారంగా మీ ముఖారవిందములు జూచు భాగ్యము లేకున్నను మీయాత్మలను నే నిరతంబును దర్శించుచునే యుందును.యెట్లన మీ యాత్మయే నాయాత్మ గనుక, నా యాత్మయే సర్వాత్మ గనుక అఖండాత్మ స్వరూపుమైన మీకు పరమ శాంతి చేకూరుగాక.

**ధర్మ పోషకులకు :-**

మా ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయ సహకారములందించిన గురు బంధువులకు, భక్తాగ్రేసరులకు, ధర్మ పోషకులకు, పవిత్రాత్ములకు నా హృదయ పూర్వక ప్రణామములు. సద్గురుమూర్తి మీకు ఆయురారోగ్యములు, అష్టైశ్వర్యములు కల్గించి, గురు కృపాసిద్ధి నొందించు గాక.

**స్వరకర్తలకు :-**

మాయీ **"అచలగురు భజనలు కీర్తనల"** కు స్వరరచన చేసినమాస్టర్ వడ్ల వేణుగోపాలాచారి (సుల్తాన్‌పూర్) గారికి,మరియు శ్రీవేంకటేశం(మంచన్‌పల్లి) గారికి నాహృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను.

**ముద్రణాలయము వారికి :-**

సమయము తక్కువగా ఉన్నప్పటికిని మా కోరిక నంగీకరించి గ్రంథముద్రణ గావించిన "శ్రీఉదయ్ ప్రింటర్స్" నారాయణగూడ -హైదరాబాదు వారికి నా నమస్సుమాంజులులు తెలియజేస్తున్నాను.

జైశ్రీ సద్గురు నాథ మహా రాజుకీజై

సర్వంసద్గురు చరణారవిందార్పణ మస్తు.


సద్గురు పాదధూళి, దాసాను దాసుడు

**[illegible]**

C/o యస్. రాచప్ప

ఇం.నెం. 5-1-200 షాహుకార్‌పేట్

స్టేట్‌బ్యాంక్ ఎదురుగా - తాండూరు

రంగారెడ్డిజిల్లా : (ఆం.ప్ర)

౨౦౨

# దాస చరితము



**తులసయ్య విశ్వకర్మ**

(నిజానంద తులసీదాసు)

జన్మస్థలము : బెన్నూరు

మండలం : యాలాల

జిల్లా: రంగారెడ్డి. (ఆం. ప్ర)

పిన్ : 501144.

జననము : 14 మే, 1965.

జననీజనకులు : కీ శే శ్రీమతి వడ్ల అంజిలమ్మ.

కీ శే శ్రీ వడ్ల లక్ష్మప్ప.

విద్యార్హతలు : B.Sc

వృత్తి : ఏ.పి.యస్.ఆర్.టి.సి. కండక్టరు. తాండూరు డిపో.

ప్రవృత్తి : శ్రీశ్రీశ్రీ శ్రీ ధర శివరామ దీక్షిత అచల గురు సాంప్రదాయ ధర్మ విస్తరణ, సనాతన హైందవ ధర్మ పరిరక్షణ, హైందవ సమాజ సమైఖ్యతకై భావాత్మక - ఆచరణాత్మక సహకారం అందించుట, భారతీయ (భరతవర్షము) సనాతన ఆర్ష సంస్కృతిని జాగృత పరచుట, విస్తృతి చేయుట, జ్ఞాని జనుల మన్నన జేయుట, పరబ్రహ్మవిద్యా వ్యాప్తి జేయుట.

ప్రస్తుత నివాసము &

గ్రంధ ప్రాప్తి స్థానము: C/o యస్. రాచప్ప

ఇం.నెం. 5-1-2000, షాహుకార్‌పేట్.

(స్టేట్ బ్యాంక్ ఎదురుగా)

తాండూరు, రంగారెడ్డి. జిల్లా (ఆం. ప్ర)

పిన్ -501141.

# విషయ సూచిక:-

# శ్రీ సద్గురుభ్యోన్నమః

## శ్రీమహ శరీర నిజగురు పరంపరాబాధ్య

## శ్రీ నిత్యానంద కృష్ణాచల గురు పరబ్రహ్మణేన్నమః

## పరిపూర్ణ బోధస్తోత్రం

శ్లో యస్యాంత ర్నాది మధ్యం నహికర చరణం నామగోత్రం నసూత్రం నోజాతిర్నై నవర్ణో, నభవతుపురుషో నానపుంసో నచస్త్రీ, నాకారం నై వకారం' నహిజనమరణం నాస్తిపుణ్యం నపాపం నోతత్వంతత్వ మేకం సహజనమరసం సద్గురుం తంనమామి

శ్లో ఆత్మానాత్మా వినాశ హేతు మనిశం సర్వాతిరిక్తం శుభం పూర్ణాత్పూర్ణ మనామయం సుఖతరం సర్వాపదధ్వంసకం సర్వజ్ఞాన వినాశకం గురుపదం, సర్వాత్మకం నిర్మలం సర్వభ్రాంతి వివర్జితం గుణహరం సంపూర్ణ బోధంనమః

శ్లో సజ్ఞాతంపరవస్తునిత్య ముచలం సత్యంస్థితంశాశ్వతం నిత్యానిత్య వివేకభేదరహితం' నిర్నామనిర్లేపకం సర్వప్రత్యయహీనకంచసతతం' సర్వత్రసంస్థంపరం వందేహం పరిపూర్ణబోధ మనిశం సందేహనాశం ప్రభుం

# శ్రీ గురు ధ్యాన శ్లోకములు

శ్లో గురు బ్రహ్మః గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మః తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో మన్నాథా శ్రీ జగన్నాథా మద్గురో శ్రీజగద్గురో
మమాత్మా సర్వభూతాత్మా తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో అఖండ మండలాకారం. వ్యాప్తం యేన చరాచరం.
తత్పదం దర్శితం యేన. తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో స్థావరం జంగమం వ్యాప్తం. యత్కించిత్ చరాచరం.
త్వంపదం దర్శితం యేన. తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో చిన్మయం వ్యాపితం సర్వం. త్రైలోక్యం సచరాచరం.
అసిత్వం దర్శితం యేన. తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో నిర్గుణం నిర్మలం శాంతం. జంగమం స్థిరమేవచ.
వ్యాప్తం యేన జగత్సర్వం తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో చైతన్యం శాశ్వతం శాంతం. వ్యోమాతీతంనిరంజనం.
నాద బిందుకళాతీతం. తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో నగురోరధికం తత్వం. నగురోరధికం తపః.
నగురోరధికం జ్ఞానం. తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో గురు మధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితోగురుః
గురుర్విశ్వం సదార్వోతి తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్ చరాచరం
త్వంపదం దర్శితం యేన తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం
అసిత్వం దర్శితం యేన తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ నిర్గుణం నిర్మలం శాంతం జంగమం స్థిరమేవచ
వ్యాప్తం యేన జగత్సర్వం తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతంనిరంజనం
నాద బిందుకళాతీతం తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ నగురోరధికం తత్వం నగురోరధికం తపః
నగురోరధికం జ్ఞానం తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ గురు మధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితోగురుః
గురుర్విశ్వం సదార్వ్యోతి తస్మైశ్రీ గురవేన్నమః

శ్లో॥ అత్రినేత్ర శివస్సాక్షా ద్విబాహుశ్చ హరిస్మృతః
అచతుర్వదనో బ్రహ్మ శ్రీ గురుః కధితం ప్రియే

శ్లో॥ సప్తసాగర పర్యంతం తీర్థస్నాన ఫలింతుయత్
గురుః పాదోద బిందోశ్చ సహస్రాంశేన తత్ఫలం

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తి పూజామూలం గురోర్పదం
మంత్రమూలం గురోర్వాక్యం / ముక్తి మ్మూలం గురోర్కృపా

శ్లో॥ గురుణాం అర్చయే నిత్యం । గురుపాదాభి వందితం ।
గురుణాం అగ్రజం శ్రేష్ఠం । తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ కాయం కాశీకురుక్షేత్రం । జాహ్నవీ చరణోదకం ।
గురుర్విశ్వేశ్వరః సాక్షాత్ తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం , కేవలం జ్ఞాన మూర్తిం।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమశ్యాది లక్ష్యం ॥
యేకం నిత్యం విమల మచలం , సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం । సద్గురుం తన్నమామి ॥

## శ్రీమదశరీర నిజగురు పరంపరా ధ్యానశ్లోకములు :-

### పరంపర ధ్యానము

ఓం .....నమోః బ్రహ్మాదిభ్యో బ్రహ్మావిద్యా సాంప్ర
దాయ కర్తృభ్యో వంశ ఋషిభ్యో మహాద్భ్యో నమో
గురుభ్యోః సర్వోప ప్లవ రహిత ప్రజ్ఞాన ఘన
ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి అహం పదార్థ రహితః

### శ్రీమహావిష్ణు సాంప్రదాయము

శ్లో॥ శ్రీ బ్రహ్మ విద్యా గురు విష్ణుసూర్యం । శ్రీ యాజ్ఞ వల్క్యం
జనకం శుకంచ ।
సాందీప మీశం కృష్ణంచ అర్జునం । వందే గురున్మే
గురుపాదుకాంతం ।

శ్లో॥ అచలావధూత యోగీంద్రం .
బ్రహ్మానంద సుబోధకాం ।
అమలానందస్య సద్యోగి ।
భావానంద గురుంభజే ।

శ్లో॥ పూర్ణానంద గురోశ్శిష్యం ।
దత్తానందం సునిర్మలం ।
రామానందం దేశికేంద్రం
జ్ఞానేశ్వర గురుంభజే

శ్లో॥ జ్ఞానేశ్వరం తశ్శిష్యం ।
సహజానంద సద్గురుం ।
రామావ ధూతానాం యోగి ।
సుబ్రహ్మణ్యా గురుంభజే

శ్లో॥ వేమన మారునూర్ణంబికః ।
తిరువేంకట దేశికం ।
మతీతంచ గురోర్దేవం .
తిరుప్పాణి గురుంభజే

## శ్రీ శివరామ దీక్షిత గురుపీఠాధికార సాంప్రదాయ ధ్యానము

శ్లో॥ శ్రీధర స్వామినం నిత్యం . బోధాకారణమవ్యయం ।
భావాతీతం మహంవందే । సుఖజ్ఞానైక నిర్మలం ।

శ్లో॥ వందారు జనమందారం । వందేహం తన్నిరంతరం ।
రామ్మడుగు వంశజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితం ।

శ్లో॥ యశ్యబోధోదయాసర్వం । బ్రహ్మవేత్తేవగమ్యతే ।
శివరామే విధఖ్యాతం । తద్దైవత ముపాస్మహే ।

శ్లో॥ కామాదిరిపు హంతారం । కారుణ్యామృత సాగరం ।
కంబాలూరప్ప రావాభిదానం । ధ్యానం వందే చమద్గురుం ।

శ్లో॥ శ్రీమత్పరశు రామాన్వయాబ్ధి । చంద్రమనోహరం ।
నిత్యానంద మహంవందే । సీతారామ గురుః పరమ్ ।

శ్లో॥ పరశురామాన్వయం బోధ । హిమాంసశ్చ మనోహరమ్ ।
సీతారామస్య భక్తానాం । శేషాచల గురుంభజే ।

శ్లో॥ శేషాచలాన్వయం బోధి । భారదేశిక ముత్తమం ।
నిరంజనం నిరాకారం । భారలింగం గురుంభజే ।

శ్లో॥ భారదేశికాన్వయం బోధ । కృష్ణ దేశిక ముత్తమం
నిరంజనం నిరాకారం భారలింగం గురుంభజే ।

శ్లో॥ కృష్ణ దేశికాన్వయం బోధ । భక్తాభీష్టఫలప్రదం ।
శుద్ధాంబర సమాదృశ్యం । సిద్ధాచల గురుం భజే ।

శ్లో॥ సిద్ధాచల పరంబోధి । సుజనాభీష్ట జయప్రదం ।
పరిపూర్ణసేవ నిరతం । కృష్ణాచల గురుం భజే ।

శ్లో॥ అస్మద్గురు సమారంభాం / కృష్ణ సాందీపమాధ్యమాం ।
శ్రీమహావిష్ణు పర్యంతాం వందేగురున్మే గురుపరం పరా ।

శ్రీగురు నిత్యానంద కృష్ణాచల దేశికేంద్ర
సద్గురుభ్యోః నమోనమః

## లఘుపూజ

శ్లో॥ ధ్యానమావాహనం సింహా । సనం పాద్యం తదైవచ
ఆర్ఘ్య మాచమనీయ్యంచ । స్నానం పంచామృతైస్సహ

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రం విభూషణం
విలేపనం చాక్షతాంశ్చ । పుష్పం స్వర్ణ వినిర్మితం॥

శ్లో॥ ధూపం దీపంచ నైవేద్యం । పానీయ్యం ఫలమేవచ
తాంబూలం దక్షిణార్థిక్యం । మంత్రపుష్పం ప్రదక్షిణం॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదితమ్
కృపయా గృహ్యతాం స్వామిన్ న్యూనాధిక్యం నచింతయ॥

శ్లో॥ లఘుపూజా విధిం భాగ । వత కృష్ణ ద్విజన్మనా
రచితం శోతృవక్తృణాం । మిదంమోక్ష కరంపరం

## పరిపూర్ణ అచలధ్యానము

శ్లో॥ పూర్ణమేవా నిరాలంబం । ఆగ్నేయే నిర్గుణం తథా
దక్షిణే నిత్యశుద్ధంచ । నైఋత్యే నిరుపద్రవం ।

శ్లో॥ పశ్చిమే నిష్కళంచైవ । వాయువ్యేచ నిరంజనం
ఉత్తరేచ నిరాకాశ । మీశాన్యే నిర్మలో భవేత్ ॥

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః॥

## పరాపూజ

శ్లో॥ పూర్ణస్యావాహనంకుత్ర । సర్వాధారస్య చాసనం ।
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ । శుద్ధస్యాచమనం కుతః ।

శ్లో॥ నిర్మలస్యకుతోస్నానం । వస్త్రం విశ్వోదర స్యచ ।
నిరాలంబ స్యోపవీతం । రామస్యాభరణం కుతః ॥

శ్లో॥ నిర్లేపస్య కుతోగంధః । పుష్పం నిర్వాసనస్యచ ।
నిర్గంధస్య కుతోధూప । స్వప్రకాశస్య దీపకం ।

శ్లో॥ నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్య ఫలంకుతః ।
తాంబూలంచ విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణా ॥

శ్లో॥ స్వయం స్వయం ప్రకాశ మానస్య । కుతో నీరాజనాదికం
ప్రదక్షిణ మనంతస్య । అద్వితీయస్య కాస్తుతిః ।

శ్లో॥ అంతర్బహిశ్చ పూర్ణస్య । కథముద్వాసనం భవేత్ ।
ఇయమేవ పరాపూజా । సర్వావస్థాసు సర్వదా ॥

శ్లో॥ ప్రేమ బుధ్యాతు సర్వేశే । మనోదేవే నివేశయేత్ ।
ఏషా మజ్ఞాన జీనానాం । సమస్తార్తిష్ఠ శాంతయే ।
యద్య బోద్ధవ్య మఖిలం తత్తద్భక్త్యా బ్రవీమ్యహం ॥

[illegible] విధానము సంపూర్ణం

# అచలగురు ఝండావందన గీతము

మధ్యమావతి - రాగం

ఆది - తాళం

ఎత్తరా - పైపై కెత్తరా - శ్రీఅచలజెండను-
ఎత్తరా - పైపైకెత్తరా ప

1. ఎత్తరా శ్రీఅచల జెండను.
చిత్తమునగురు-బోధ నింపియు
సత్తు చిత్తా- నందముల మని
సరగునన్ ఎగదోయు జెండను ఎ

2. మూర్తి త్రయముల-మూలమెరిగియు
వాలుకన్నుల-వోల లాడుచు
ఫాల భాగపు -పైన నమరిన
వేయిదళముల - వేదికాగ్రము నె

3. తను మనంబులు - ధనసమూహము
ధారబోసియు - ధన్యతొందియు
జనన మరణపు - భ్రాంతినీ
రూడించి వేయగ - జాలు జెండను ఎ

4. నిర్మలంబగు - హృదిని బొందియు
మర్మమంతయు - మనసు నుంచియు
కర్మ చయమును - కాల్చి వేసెడి
ధర్మనిరతిని - నిలుపు జెండను ఎ

5. చక్రములు - ఆధారమాది
సహస్రదళముల - సరణియంతయు
చక్రి జాలమె - యనుచు నీ
మఱుగెరుక -జేసిన-అచలజెండను

6. ద్వంద్వ భ్రాంతియు - నెల్లనూ
నిర్ద్వంద్వముగ మది - దొలగ జేసియు
సంధి కావలి-మర్మమును గురు
నందు నిలుపగ - జేయు జెండను

7. బ్రహ్మవిష్ణు -మహేశ్వరాదులు
సంతతము మది - నిల్పు జెండను
వమ్ము జేసియు - ఎఱుక సిరి, నచ
లమ్ము దెలిపెటి - పరమ జెండను

8. పరమ గురువరు - కృష్ణ దేశికు
చరణ యుగ్మము - నమ్మి తులసికి
పరమ పదవిని - నొందజేసిన
స్థిరము దెల్పెటి - సూటి జెండను

# ఓం

## శ్రీ సద్గురవే నమః

## విజ్ఞాపనము

అచల గురు మార్గము నందలి ధర్మ, మర్మములు మరియు తదనుగుణ అహంరహిత కర్మములు శ్రుతి, స్మృతి, యుక్తముగా, సదృష్టాంత సమేతముగ వివరింప బూనిన వాడైన ఆ సద్గురు మూర్తి అచేతనమైన ఒకానొక తనువునకు చేతనత్వమును, గురుజ్ఞానమును, ఓజస్సును, తేజస్సును కల్గించి, సంకల్పము కాని సంకల్పము చేత సద్భక్తులకు గురుజ్ఞానాసక్తి కల్గునట్లుగ, గురుపాద దాసులకు జననమరణ భ్రాంతి రహితమగుటకు సులువగు మర్మంబులను, బయలు పరచుచు, బయలును, బయలను పేరున బిలిచే ఎఱుకను బయలునందున బయలు జేయుటకు గాను తన ముద్దుల బిడ్డకు (దీక్షితునకు) బయలు భావము దృఢమగుటకు గాను, మూలము లేని ఎఱుకకు మూలము లేదనె మఱుగును, మూలము లేని ఎఱుకచే తనే ఎఱిగింపజేసి, ఎఱిగిన ఎఱుక నఱుగ జేయు కౌశలములకు గాను, అఱిగిన ఎఱుక తిరిగి వెనుకకు మరలకుండుటకు గాను దీక్షితునకు బయలను పరిపూర్ణభావం దృఢమగుటకు తనబోధయందలి నియములను నిష్ఠను, గురుపారంపర్య విశేషతను, నడి-నుడి భావనను కల్గునట్లుగ అనేక యుక్తియుక్తములను ఆ సద్గురుమూర్తి తన బిడ్డడైన తులసీదాసను నామధారియైన, అశరీర శరీర రూపుని నోటి వెంబడి వెలువరించుచున్నాడు.

సద్గురు పాదధూళి

అ. ప. నిజానంద తులసీదాసు

శ్లో॥ గురుర్నేవ పరోధర్మో గురుర్నేవ పరాగతిః

తా॥ గురుడొక్కడే శ్రేష్ఠమైన ధర్మము
గురువు ఒక్కడే శ్రేష్ఠమైన, ఉన్నతమైన పదవి
(శాట్యాయనియోపనిషత్తు)

## గురుమంత్రదీక్ష

శ్లో॥ దుస్సంగంచ పరిత్యజ్య పాపకర్మ పరిత్యజేత్
చిత్తచిహ్నమిదం యస్య తస్యదీక్షా విధీయతే

తా॥ దుష్ట సాంగత్యమును విడిచి, పాపకర్మమును వదలునట్టి, గుఱుతు యెవనికి కలుగునో, వానికే గురు మంత్ర దీక్ష ఈయబడుచున్నది

శ్లో॥ చిత్తత్యాగనియుక్తస్య క్రోధగర్వ వివర్జిత.
ద్వైత భావ పరిత్యాగే తస్యదీక్షా విధీయతే

తా॥ మనో త్యాగముతో గూడుకొని యున్నవాడును, కోపాహంకారములను విడచిన వాడును, జీవేశ్వరుల యందు భేద బుద్ధి లేనివాడును, ఎవడో వానికే గురుమంత్రదీక్ష విధింపబడియున్నది.

శ్లో॥ ఏతల్లక్షణ యుక్తత్వం సర్వభూతహితేరతం
నిర్మలం జీవితం యస్య తస్యదీక్షా విధీయతే

తా॥ ఎవడు ఈపూర్వము చెప్పిన లక్షణములతో గూడుకొని సమస్త జీవులకు హితమొనర్చుట యందాసక్తి

కలిగియున్నాడో, నిర్మలమగు ప్రాణధారణము
గలదో వానికేగురుమంత్రదీక్ష విధింపబడియున్నది.
(సుజ్ఞానదీపమను గురుగీతలు)

## నియమావళి

1. గురు మంత్రోపదేశమైన వారెల్లరు భక్తులనబడుదురు.
2. భక్తుల యొక్క భక్తి, సేవ, భజన, శ్రద్ధలను గమనించి,సూచన గావింప బడిన వారుముముక్షువులు.
3. భక్తి, జ్ఞాన వైరాగ్యము గలవారై, జన్మరాహిత్య పదవిని సాధించు ముముక్షువులు, సాధకులుగా పరిగణింప బడుదురు.
4. ప్రతి దినము ప్రాతః కాలము 5గం.ల కంతా మేల్కొనికూర్చుండి నియమములను ధ్యానించిన తర్వాత, స్నాన, జప, తప, సంధ్యానుష్టానములు గావించి,తన గృహకృత్యములను నెరవేర్చుకొనవలయును.
5. గ్రంథపఠనము, ఆధ్యాత్మిక శ్రవణము,ఆత్మానాత్మ వివేకము, నిష్కామకర్మ సదా సక్రమముగా సలుపుచుండవలయును.
6. అహం పదార్థ రహిత వ్యాపారం కుర్యాత్ దినచర్య లిఖించుట.
7. కాలమును తప్పక సంచరించుట,కాలనిర్ణయ పత్రిక లిఖించుట.
8. సోమరితనము పనికి రాదు.
9. సాధన ప్రణాళిక వ్రాసి అనుదినము పూజా కాలము తప్పక చదువవలెను.

10. లౌకిక సంస్థలకు దూరులుగ నుండవలెను.
11. పూజ , జపము, నిత్యనైమిత్తి కాదులలో నొక భాగముగ నలవడవలెను.
12. వారమున కొకసారియైనను ఆధ్యాత్మిక విచారణ చేసి తీరవలయును.
13. ప్రతి పూర్ణిమకు గురుపూజ తప్పక పూర్ణముగా చేసికొనవలెను.
14. మనసు వలదన్న దానిని చేయకుము, మనసు కోరిన దానిని విచారించి చేయవలెను.
15. ఉదయము నుండి సాయంకాలము వరకు వ్యావహారికములలో న్యాయముతప్పక ఉచితరీతిని సంచరింపవలెను.
16. దొరికినంతలో ఆధ్యాత్మిక విచారణలో కాలము గడుపవలయును.
17. గురుభావమును పెంపొందించుయే యితర గ్రంథమైనను సరియేచదువ వలెను. తన గురుభావమును నశింపజేయునది ఏయు గ్రంథమైనను దాన్నిచదువకూడదు.
18. తను మన,ధనములు గురువునకు వినయంబుగా ధారబోసి, నిస్పృహుడై త్యాగ బుద్ధిచే అచల గురుపీఠం యొక్క అభివృద్ధి మరియు మానవ మాత్రుల కళ్యాణము మొదటి కర్తవ్యమని ప్రాధేయపడవలయును.
19. ముముక్షువులు వారియొక్క శారీరక,ఆర్థిక,నైతిక, పరిస్థితులను మండలిలో తెల్పుచుండవలయును.
20. మండలిలో జరుగు ప్రతి గురువారపు బోధలకు మరియు వారికై ప్రత్యేకముగా నియమింపబడిన బోధలకు యిత్యాది పూజలకు

తప్పక రావలయును.

21. ఘనమైన పరిపూర్ణ బోధ ప్రభావము జనులంతఃకరణము నందు వ్యాపింపజేయ వలయును.

22. అచల గురు మండలిలో చేరిన శిష్య బృందము నందు ప్రేమ, ఐకమత్యము, సోదరత్వము,సేవాభావము నెలకొలుపునదే కాక, వారితో నెట్టి హాస్యములు మరియు పరిహాసములు చేయ కూడదు. ప్రతి శిష్యుని యొక్క "నడి-నుడి" భావనలు తెలుసుకొనుచు మండలి యందు తెలుపు చుండవలయును.

23. తమకువీలైనంతటి సమయమును మండలి కార్యములలోను, అచల గురు పీఠం అభివృద్ధిలోను మరియు మానవ సేవలోను, వినియోగించుచూ,దేశకాల పరిస్థితుల ననుసరించి,భక్తముముక్షువు ల భక్తి శ్రద్ధలను గమనించి వారికి తగిన మండలి కార్యములను నియమించవలయును.

24. మండలి నియమాను సారముగ నడుచుకొనుచు, వారిపై నియమిత అధికారుల ఆజ్ఞోల్లంఘనము చేయకుండ, అవి గురువాజ్ఞయని తలంచి, శిరస్సావహించి నడుచుకొనవలయును.. భక్తులు , ముముక్షువులు, సాధకులు "నడి-నుడి" భావనలో సక్రమముగా నడువక లోపములు గలిగినచో గురువాను గ్రహము పొందు వరకు పతితులుగ యెన్నబడరు. పతితులుగా పరిగణించబడుదురు.

(భూమానంద వాక్యామృతం)

బ్రహ్మజ్ఞానము కలుగువరకు జగత్తు సత్యమే యని స్వీకరించి

వ్యవహారము నెరపుచు బ్రహ్మజ్ఞానమునకై యత్నింపవలయును. ఆ జ్ఞానము కలిగిన పిదప ఈ జగత్తు మిథ్యయే యని తేటతెల్లమగును. అపుడు ఈ మాయాజాలమున నిక చిక్కుకొనక జ్ఞానియగు పురుషుడు ఎప్పటివలెనే జగన్నాటకమున తన పాత్రను నిర్వహించవలయును.

శ్లో॥ తచ్చింతనం తత్కథనం తత్ప్రబోధనమ్
ఏ తదేక పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః

తా॥ బ్రహ్మాభ్యాసమనగా బ్రహ్మమును గూర్చి మననము చేయుట, దానిని గూర్చి మాటలాడుట, పరస్పరము తర్కాదుల ద్వారా, విచారణల ద్వారా బ్రహ్మమును బోధపరచుకొనుట. ఇట్లు బ్రహ్మమునందే తత్పరులై యుండుట యని బుధజనులు చెప్పుదురు.

(వాసిష్ట రామాయణము ఉత్పత్తి ప్రకరణము 22-24)

శ్లో॥ పరోక్ష జ్ఞాన మశ్రద్ధా ప్రతి బధ్నాతి నేతరమ్
అవిచారో పరోక్షస్య జ్ఞానస్య ప్రతిబంధకః

తా॥ పరోక్షజ్ఞానము కలుగుటకు అశ్రద్ధయే యాటంకము. విచారముచేయలేకపోవుట అపరోక్ష జ్ఞానమునకాటంకము. (చూ. వివేకచూడామణి-[illegible]. అపరోక్షానుభూతి-[illegible])

కావున వర్తమాన ప్రతిబంధకములైన మందబుద్ధి వితండ వాదము. విపరీత భావనయగు ఆత్మయొక్క కర్తృత్వ భోక్తృత్వముల యందు దృఢవిశ్వాసము, విషయ భోగము ల యందు ఆసక్తి, మొదలగు

వాటిని నిరంతర బ్రహ్మవిచారము చేత మనస్సునుండి వదలివేసి ఆపై..

శ్లో క్షమాద్యైః శ్రవణాద్యైశ్చ తత్ర తత్రో చితైః క్షయమ్
నీతేస్మిన్ ప్రతిబంధేతః స్వస్య బ్రహ్మత మశ్నుతే

తా శమ దమాదులయభ్యాసముచేతను, శ్రవణమననాదుల చేతను, పై ప్రతి బంధములునశింపగా ప్రత్యగాత్మయే బ్రహ్మమనితెలిసికొని, నిరంతరము అట్టి బ్రహ్మమును ఉపాసించ వలయును.

చూ. (బృహదారణ్యకఉప -4.4 23 : 2.4.2.2.5, వివేక చూడామణి 22-27, 59-7?)

శ్రీమద్రాజాది రాజ రాజ యోగీంద్ర చంద్రులైన శ్రీమద్భాగవత కృష్ణ దేశికేంద్రులు తనశుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు అను సద్గ్రంథము నందు మొదటి కందార్థములో సెలవిచ్చినట్లుగా జనన మరణ భ్రాంతి రహితమును కాంక్షించు ప్రతి శిష్యుడు నిర్ధముగా సులక్షణయుతుడైయుండవలయును.

ఈ భావమునే మనము పరమయోగీశ్వరుడు సాక్షాద్భగవత్ స్వరూపుడు ''శ్రీమద్భగవద్గీత''అను అమృత వాక్యాల ప్రవచనాచార్యులు అయిన శ్రీ కృష్ణ భగవానులు కూడ మున్నె నుడివి యుండిరి. శ్రీమద్భగవద్గీత దైవాసుర సంపద్విభాగయోగము 16. అ; 1శ్లో నందు గీతాచార్యులు తెలిపినట్లుగ దైవిక గుణములుఇరువది ఆరున్ను (26) దైవసంపత్తి

యందు జన్మించినవారికి మాత్రమే కలుగుచుండును. ఇవిలేనివారు అట్టిదైవ సంపదకై యత్నించి యద్దానిని (దైవము) పొందవలయును.మోక్షమున కీ సద్గుణములన్నియును అత్యావశ్యకములు. అవి యేవనగా...

శ్లో : అభయం సత్త్వ సంశుద్ధిర్జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్

1. అభయం:- ఒక్క ప్రాణికైనను భయమును గలుగ జేయకుండుటయు, తాను యెట్టి విషమ స్థితిలోనూ భయము నొందకుండుటయు.
2. సత్వసంశుద్ధి:- అంతఃకరణ పరిశుద్ధత పొంది స్వరూపాను సంధానములో సుస్థిరత గలిగియుండుట.
3. జ్ఞానయోగ వ్యవస్థితి:- జ్ఞానాభ్యాసములోను, యోగాభ్యాసములోను నిశ్చలమైన నిష్ఠ కల్గియుండుట.
4. దానం: - శక్తి కొలదిగ దీనజనులకు, విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారికి దానము చేయుట.
5. దమశ్చ:- బాహ్యేంద్రియములను దృశ్యవిషయములలో పోనీయక తత్తత్‌స్థానములలో నిలుపుట.
6. యజ్ఞశ్చ:- అతిథి పూజ, ప్రాణి సంరక్షణ, అగ్నిహోత్రాది, కార్యములుచేయుట.
7. స్వాధ్యాయః:- వేద, ఉపనిషద్ గీతాదులను, పరిపూర్ణావల సర బాహ్యము భావనను స్థిరపరచే సద్గ్రంథములను విధిప్రకారముగ నధ్యయనం చేయుట. సద్గురు

మంత్రమును నిరంతరము యేమరకుండ జపించుట.

8. తపః :- ఇంద్రియైకాగ్రతతో జ్ఞానాగ్నియందు సమస్త మనోవృత్తులను భస్మము జేయుట.

9. ఆర్జవం:- మనోవాక్కాయ కృత్యముల నేకరీతిగానడుపుట.

శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతేష్వ లోలత్వ మార్దవం హ్రీర చాపలమ్ ॥

10. అహింసా:- త్రికరణములచే ప్రాణిపీడ చేయకుండుట.

11. సత్యం:- యదార్థ భాషణము

12. అక్రోధ:- క్రోధమును గలుగనీయకుండుట.

13. త్యాగ:- కర్మఫల త్యాగమును ఈశ్వరార్పణ, గురార్పణ చేయుట, లేక అనాత్మమనోవృత్తులను అంతఃకరణము నుండి తొలగించుట.

14. శాంతి:- అంతఃకరణమును ప్రశాంతముగనుంచుట.

15. అపైశునమ్:- ఇతరుల దోషములను వెల్లడి చేయక యుండుట.

16. భూతేషు దయా:- ప్రాణికోట్లయెడ కరుణకల్గియుండుట.

17. అలోలత్వం :- విషయాదులచే చలింపక యుండుట. అనగా నిర్విషయ స్థితి నొందుట.

18. మార్దవం :- మృదు స్వభావం కల్గియుండుట.

19. హ్రీం :- అధర్మ కార్యములలో లజ్జకలిగి యుండుట.

20. అచాపలం:- ఇంద్రియములు విషయములను స్మరింపక ఆత్మ

నిష్ఠలో నిశ్చలముగా నమరియుండుట.

శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత ।

2[illegible]. తేజః :- సత్వగుణముతో బ్రహ్మవర్చస్సు గలిగియుండుట.
22. క్షమా:- శీతోష్ణ సుఃఖ,దుఃఖాది ద్వంద్వములలో సహనము గలిగి యుండుట.
23. ధృతి:- నిష్ఠలో ధైర్యము గలిగి యుండుట.
2[illegible]. శౌచం:- శారీరక మానసిక శుద్ధితో నుండుట.
25. అద్రోహో:- పరులకు ద్రోహకార్యము చేయకుండుట.
2[illegible]. నాతిమానితా:- అభిమానము లేక యుండుట.

వివేక ఘనులు, ఆత్మానాత్మ విచారపరులు, పరిశుద్ధ అంతంకరణ యుక్తులు, కేవలాత్మభావాసక్తులు, శుద్ధ సాత్విక గుణయుతులు, సర్వమైన తనను గురార్పణ గావించదలచిన ప్రవిమల చిత్తులు నగు దీక్షితులు,. పెద్దల ఆశీర్వచన వాక్కులైన పీటపై మక్కువ గలిగి, మిక్కిలిగ నాచరింతురు గాక.

## [illegible]సేవా క్రమము

శ్లో॥ అస్తే వ్యాకరణాద్బుద్ధేః సాక్షాత్కారో విశిష్యతే
స్యాత్కృతార్థత్వ ధీర్యావత్తావద్గురుముపాస్వభో ।

తా॥ వ్యాకరణాదుల సహాయముతో అర్థము తెలిసికొనినను సాక్షాత్కారము మిగిలియే యుండును. కనుక

బ్రహ్మసాక్షాత్కారమై ఇక చేయవలసినదేమియు లేదని తెలియువరకుగురువును ఉపాసింపుము. (వేదాంత పంచదశి) (చూ కఠఉప . 1-2-9).

సీ. గురుడేగు దెంచిన కూర్చుండగా రాదు
కూర్చుండ నెడబాసి కుడువరాదు
బోధింప విడనాడి పోరాదు
బోధింప బడకున్ననిర్బంధపరుపరాదు
దయనను గ్రహ మీయ తడువు సేయగరాదు
తడవైన తత్తర పడగరాదు
ఒంటి శయనాసనా లొదువ నుండగ రాదు
స్నాన భుక్తులు ముందు సలుపరాదు.
వినయ భక్తులెదలోనవిడువరాదు
గురుని సేవించు పరమ భక్తునకువత్స.

ఆ.వె. గురుడు విముఖుడైన గురిలేదుమును బ్రహ్మ
వేదియగు వశిష్ఠ విముఖుడగుచు
కరుణ జూడకున్న గాదెకౌశికుడు॥
బ్రహ్మ ఋషియు గామి ప్రచురమగుట.

వ అట్లుగాపున

క ఆచార్యుడొప్ప కుండెడు
నాచారములొప్పగూడ దన్యమతము
లాలోచింపి మొగ్గిన్వమత

ప్రాచుర్యమొనర్ప రాదు భక్తుడు పెలుచన్
మ నరమాత్రుండని చూడరాదు పెలుచన్ నైచ్యుండు కారాదుసం
కరకార్యంబులు చేయరాదు మదిలో గర్వింపగారాదు దు
ష్కర యుక్తిం బరికింప రాదతనియాజ్ఞల్ మీరగారాదుమ
త్సర మున్ బట్టగరాదు సద్గురునిపై సచ్ఛిష్యుడై యుండినన్

ఆ.వె గురుడు సుముఖుడై పరతత్వము గాంచి
ముక్తి జెందునరుడు మున్ను గురుని
సుముఖతయు గలంగి నూరి రాజర్షులు
బ్రహ్మ ఋషులు మోక్షపదవి గనుట.

ఉ ఎచ్చట సద్గురుండు వసి యించి సుఖంబున వెల్గుచుండుదా
నచ్చట కాశిగంగయు ప్ర యాగగయాదులువిశ్వనాయకుం
డచ్చట నారదుల్ సరసు లచ్చటనేయమునా సరస్వతుల్
నచ్చటసర్వతీర్థములు నచ్చట దేవతలొప్పుచుండెడున్

వ అట్లుగావున

క గురుపదముల సేవింపుచు
గురు వాక్యము నమ్ముకొనుచు గురునుతి వినుచున్
గురు మంత్రము జపియించుచు
గురు సన్నిధి నుండవలయు గురు భక్తుండున్

ఆ.వె గురు పదాంబు జంబు గొని యభిషేకంబు
చేసి తజ్జలము శిరము నందు
జల్లుకొనుచు గ్రోలు సద్భక్తుడఖిల

తీర్థముల గ్రుంకు ఫలము తానెపొందు

క  గురు పద సందర్శమున
గురు పదజల పానమునను గురుపద పూజన్
గురుపద వినతుల త్రిజగ
ద్గురు పద సంప్రాప్తియగుమ గురు భక్తునకున్

సీ  ఆచార్య పాద పద్మార్చనంబే జగ
దాచార్య పాద పద్మార్చనంబు
దేశిక మంత్రోప దేశమే వైకుంఠ
దేశిక మంత్రోప దేశికంబు
గురు సుప్రసాదాను కూలనంబే బ్రహ్మ
గురు సుప్రసాదాను కూలనంబు
సద్గురు నామ సంస్మరణంబె బుధహ్వాళ్ల
సద్గురు నామ సంస్మరణ తతియు

క : గురుతనూ తత్వ భావనా పరత దేవ
గురు తనూ తత్వ భవనా పరత యగుట
గురు తరంబైన మోక్షంబు కొదువ బడునె
గురు వరుని జేరియున్న భక్తునకు వత్సా
(చూ - సుజ్ఞాన దీపమను గురు గీతలు)

సీ  గురుసేవ కన్న నెక్కువ తత్వమిల లేదు
సకల జీవులు భక్తి సలుప వలయు
శయన వాహన వస్త్రచయ భూషణాదులు

ప్రియమున గురున కర్పింపవలయు
నారాధనార్థమై యర్థమున్ జీవంబు
నంతయు గురునకర్పింపవలయు
వా॥ కర్మమానస వైభవంబుల గురు
శ్రీకరంబుగను భజింపవలయు

తే॥ నురము కరములు బాదముల్శిరము నుదురు
నిలను మోపుచు సాష్టాంగ మలవరించు
వేత్త లజ్జాభిమానముల్ విడిచి ముక్తి
సాధకుని జేరు టీలాగే చంద్రవదన

తా॥ ఓ ఇందువదన యగు పార్వతీ. ఈ ప్రపంచము
నందు గురు వర్యుని సేవించటకంటె శ్రేష్ఠమైన
దేదియు లేదు. అదియే తత్వమని దెలియుచు
సకల ప్రాణులును గురుభక్తి చేయవలయును.

శయ్య, వాహనము, వస్త్రము, భూషణము, మొదలగు వస్తువులను ప్రేమతో నర్పించవలయును. గురువు యొక్క ఆరాధనము కొరకు ధనమును, ప్రాణమును, గురువర్యున కొసంగ వలయును. మనస్సు, వాక్కు, కాయములను త్రికరణములయందును సద్గురుని శుభకరంబుగ స్తోత్రము చేయవలయును. రొమ్ము, చేతులు, పాదములు, శిరస్సు, నెత్తి, అను వీనిని దండాకారముగ భూమియందు మోపి మనస్సుతో గురువును ధ్యానించుచు సాష్టాంగ నమస్కారము చేయవలయును. గురువునకునమస్కారము చేయునపుడు సిగ్గు,

అభిమానము అను సీరెంటిని విడిచి నమస్కరించవలయును. ఈ ప్రకారము తన్ను మోక్షమును బొందుటకు అర్హునిగా జేయునట్టి సాధకాచార్యుని ఆశ్రయించు వాడు చేయవలయును.

(గురుగీతాసారము-47)

శ్లో॥ కర్మణా మనసా వాచా గురుణాం భక్తవత్సలాః
శరీర మర్థం ప్రాణంచ సద్గురుభ్యోనివేదయేత్

తా॥ గురువునందు భక్తిగల శిష్యుడు కర్మచేతను,
వాక్కు చేతను, శరీరమును, ప్రాణమును, ధనమును
ఆచార్యునకు సమర్పించవలయును.

(గురుగీతా సారము -48)

శ్లో॥ ఆత్మా విశుద్ధ చైతన్యస్వరూపశ్శాశ్వతో విభుః
నిర్వికార స్స్వయం జ్యోతిః స్వభావోర్క ప్రకాశవత్

తా॥ పరిశుద్ధమైన జ్ఞానమే స్వరూపముగా గలవాడును, భూత భవిష్య ద్వర్తమానములను త్రికాలముల యందును (శాశ్వతమై) నాశము లేక యుండువాడును, సకల వస్తువులయందును (సర్వ భూతాంతర్యామియై) యుండు వాడును, రూపభేదము నొందక యుండు వాడును, ఇతరములచే ప్రకాశమొందక తనకు తానే ప్రకాశించు వాడును, అనగా అన్నిటిని ప్రకాశింపజేయువాడును, సూర్యతేజస్సు వలె ప్రకాశమానుడు నునై యుండువాడును పరమాత్మ (శ్రీగురు) యని తెల్యదగును.

(గురు గీతాసారము - 58)

శ్లో॥ గురు ర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవ స్సదాశివః

నగురోరధికః కశ్చిత్ త్రిలోకేషు విద్యతే
దివ్య జ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరం
పూజాయేత్పరమాభక్త్యా తస్యజ్ఞాన ఫలంలభేత్

తా : గురువే బ్రహ్మయును, విష్ణువును,సదాశివుడును నై యున్నాడు.మూడు లోకములయందును గురువులకంటెను శ్రేష్ఠమైన వాడెవడును లేడు. దివ్యాజ్ఞానమును ఉపదేశించు వాడును, పరమేశ్వరుడును,అగు గురువునుభక్తితో పూజింప వలయును.

(యోగ శిఖోపనిషద్)

శ్లో సర్వాకారం సర్వమసర్వం సర్వనిషేధావధి భూతం
యత్తత్సత్యం శాశ్వత మేకమనంతం బుద్ధం తత్త్వమసిత్వం

తా (గురువు శిష్యుని జూచి) ఏదిసర్వరూపమును,ఏది సర్వముగానిదియును, నేతినేతి యనిసమస్తమును నిషేధింపగా మిగిలియుండు నదియును, సత్యమైనదియును, శాశ్వత మైనదియును, ఏకమై యుండునదియును, అంతము లేనిదియును, నిర్మలమైనదియును, బోధ రూపమైనదియును ,అగు తత్త్వస్వరూపము (పర బ్రహ్మము) నీవై యున్నావు అను నిట్టి గురువాక్య ప్రకారము, శిష్యుడును అట్టిగురు స్వరూపుడై యున్నాడు. ఈయభిప్రాయమును శిష్యుడు మనంబున నుంచుకొని సద్గురువునకు నమస్కరించెనని యెఱుంగునది.

(గురు గీతాసారము - 63)

శ్లో గురుర్దేవ పరం బ్రహ్మ గురుర్దేవ పరంధనం
గురుదేవ పరావిద్య గురుదేవ పరాయణం

గురుదేవ పరఃకామో గురుదేవ పరాగతిః
యస్మాత్తదుపదేష్టా తస్మాత్సౌద్గురు తరోగురుః
అర్చనీయశ్చ వంద్యశ్చకీర్తనీయశ్చ సర్వదా

తా : ఓ గౌరీ ! గురువే పర బ్రహ్మము, గురువేమహా ధనము, గురుడే శ్రేష్ఠమైన విద్య, గురువే మహా ప్రయోజనము, గురువే పొందదగినవాడు, గురువే పూజింప దగినవాడు, గురువే పొగడ దగిన వాడు, గురువే ఉపదేశింప దగినవాడు. అన్నింటి కంటెను గురువే శ్రేష్టమైన వాడని భావింప దగినవాడు.

(గురుగీతాసారము- 64)

శ్లో దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్వదర్శనం
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా

తా సద్గురు వర్యుని కరుణలేని యెడల విషయత్యాగ మునను, పరమాత్మ దర్శనము, బ్రహ్మనిష్టయును, దుర్లభములగును. ఇవి యన్నియును సద్గురు కృపచే కలుగును.

(గురుగీతా సారము -65)

శ్లో గురోశ్చ గురువస్సర్వే పూజనీయావిశేషతః
గురు దార సుతాదౌచ గురువద్వృత్తి మాచరేత్

తా తన గురువునకు గురువైన యట్టి ఆచార్యుల యందును,తన ఆచార్యుని పుత్ర పౌత్రాదుల యందును, స్వాచార్యుని యందువలె (భక్తితో) వర్తింప వలయును. (గురుగీతాసారము- 65)

శ్లో॥ యస్యదేవే పరాభక్తిర్యధా దేవేతథాగురౌ
తస్యైతేకథీతాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మన ః

తా॥ ఏ పురుషునకు పరమాత్మయందు భక్తియును, ఆ పరమాత్మ యందలి భక్తివలెనే సద్గురువర్యుని యందు భక్తియును కలదో అట్టి మహాత్మునికి పరమ రహస్యములు బుద్ధియందు ప్రకాశించు చున్నవి. (గురుగీతాసారము - 65)

శ్లో॥ అనంతజన్మ సంప్రాప్త కర్మేంధన విదాహినే
జ్ఞానానల ప్రభావేనతస్మైశ్రీ గురువేనమః

తా॥ జ్ఞానాగ్ని ప్రభావము చేత అనేక జన్మముల నుండి సంపాదింప బడినట్టి కర్మములనెడి కట్టెలనుదహించు వాడైనట్టి శ్రీగురు మూర్తికి నమస్కారము చేయువలయును. (గురుగీతా సారము-66)

శ్లో॥ దత్తాతు దక్షిణాంతస్మైయథాశక్తి యథావిధి
తమర్చ యేద్యధాకాలం హితంచాస్య సమాచరేత్

తా॥ శిష్యుడుఆచార్యునకు శక్తికితగినట్లుగ శాస్త్రోక్త ప్రకారముగా దక్షిణ నొసంగి తగిన కాలములయందు ఆరాధింప (పూజింప) వలయును. గురువునకు హితమైన కృత్యములను అనగా నాలుగు శుశ్రూషలను చేయవలయును.

(గురుగీతా సారము - 6౮)

మరియు సద్గురువర్యుని పదకమల సేవ వలన
కలుగు సౌభాగ్యములు తెలియునది.......................

సీ॥ ఏ స్థలంబున గురు నెలమిదర్శించిన

గామాది షడ్వర్గ గర్వమణుగు
నేదిక్కునను గురు పాదముల్సేవింప
సర్వ దుఃఖాదులు సమసిపోవు
నెచ్చోట గురునకు నచ్చుగా మ్రొక్కిన
భవ బంధములనెల్ల బాఱద్రోలు
నెప్పుడు గురువరు డెలమి బోధించిన
బరిపూర్ణ నిత్యాత్మ ప్రబలివెల్గు

తే. ముక్తి సిద్ధించు సన్మార్గ యుక్తి గల్గు
నాత్మ తానని యితరంబు లన్నిమఱచు
నేర్పు గలిగించు భ్రమలను నిగ్రహింప
జేయుసద్గురు పాద రాజీవ మహిమ

తా. ఓ పార్వతీ! ఏచోట గురువర్యుని దర్శించినప్పటికిని కామ క్రోధ లోభ మోహ మదమత్సరములనెడి శత్రువర్గము లాఱును నశించును. ఏదిక్కునందుసద్గురు పాద కమలంబులను సేవించినప్పటికిని సకలమైన దుఃఖములును నశించును. ఎచ్చోట గురువునకు నమస్కరించినను భవబంధములు (జననదుఃఖములు) తొలగిపోవును. గురూత్తముడుబోధించిన మాత్రమున పరబ్రహ్మము చక్కగా ప్రకాశించును. ఇదియును గాకమోక్షమును కల్గును. సన్మార్గమునందు బ్రవర్తింప జే[illegible] అహం బ్రహ్మాస్మియను బోధము కల్గును. ప్రపంచవాసనల [illegible] నశించిపోవును. మంచి తెలివికల్గించును భ్రమలన్ని[illegible]

నివర్తియగును. ఇట్టి మహోత్కృష్ట పదవులన్నియును, సద్గు
వర్యుని పదకమల సేవ వలన కలుగును.

(గురుగీతా సారము - 67)

శ్లో॥ విచారణీయా వేదాంతా వందనీయో గురుః సదా:
గురుణాం వచనం పథ్యం దర్శనం సేవనం స్పృణా

తా॥ వేదాంతము విచారింపదగినది. గురువు ఎల్లప్పుడును
పొగడ దగిన వాడు. గురువు యొక్క వాక్యమును,
గురు దర్శనమును, గురుసేవయును, మనుజునకు ఎల్లప్పుడున
పథ్యమైనది. అనగాహితమైనది (గురుగీతాసారము- 57)

శ్లో॥ గురుర్బ్రహ్మ స్వయంసాక్షాత్ సేవ్యా బంధోముముక్షుభిః
నోద్వేజనీయ ఏవాయం కృతజ్ఞేన వివేకినా

తా॥ గురువు సాక్షాత్ బ్రహ్మస్వరూపమును ముముక్షువులచే సేవిం
దగిన వాడునై యున్నాడు. కృతజ్ఞుడై (సచ్ఛిష్యుడైన) వివే
వంతునిచేతనతడుత్యజింపదగినవాడు కాడు. అనగా నిరంతరమున
గురుభక్తి చేయవలయునని భావము.

(గురుగీతా సారము- 68)

సీ॥ గురు సేవజేయంగ కోరిక గలవాడు
బలువైన భవ బంధ భ్రాంతిరోసి
చాలు నీ సంసార జోలిని బడియున్న
మేలు లేదెందు నీ మేను సతము
గాదు గావున నాత్మ క్రమమంత లెస్సగాం

గన్న మహాత్ముల గలసి మెలసి
తల యెత్తగాజేయుదైవమీ ధాత్రిని
నాపాల గలడో యెన్నంగ లేడో
తే యెటుల దొలి కృత్యమున్నదో యెఱుగలేద
టంచు వేదన జెంది కుహక ప్రసంగ
మాదులను గూడకను ముక్తి వాంఛ నెపుడు
చిత్తమున జేర్చి గురుసేవ చేయవలయు

తా ఓ పార్వతీ. గురుసేవ సేయవలయునను కోరిక గలవాడు భవ బంధముల యొక్క భ్రమను మాని, ఈ సంసారము నందుండునంతదాక మేలు గలుగ దనియును, ఈ శరీరము శాశ్వతముగాదనియును కావున, ఆత్మజ్ఞాన మెరింగిన వారితో, గూడియుండి నన్ను ఉద్ధరించువమహాత్ముడగు సద్గురువు (దైవము) ఈ భూమండలము నందున్నాడో లేడో యనియును విచారించి, నాపూర్వజన్మ కృత్యమెట్టిదో నేనెరుగ లేకున్నాడనని చింతించి, కపట సంగమము లందుజేరక నిరంతరమును మోక్షముకలుగవలయు ననెడి తలంపు గలవాడై సద్గురు సేవ చేయవలయును. (గురుగీతాసారము - 59)

శ్లో సంసారోద్విగ్నమనసాతాప త్రితయభీరుణా
నిరక్తేనేహచాముత్ర ఫలేగమ్యోగురుర్మహాన్

తా సంసారమునందు మిగుల భయమొందిన మనస్సు గల వాడును, తాపత్రయమునకు భయపడినవాడును, ఇహపరముల యందు

గలుగు ప్రయోజనముల యందు విరక్తి నొందిన వాడును, మహాత్ముడైన గురువును సేవింపవలయును.
(గురుగీతా సారము - 10)

శ్లో ఆచార్యవాన్ పురుషోహి వేదేత్యేవం శృతిర్జగౌ
అనాదావిహ సంసారేబోధకోగురు లేనహి

తా ఆచార్యుడు కల పురుషుడే (ఎవనికి ఆచార్యుడు -గలడో వాడు), సత్తామాత్రమైన పరమాత్మను ఎఱుంగును. అనాదియైన ఈ సంసారము నందు (ఆత్మానాత్మల భేదమును) తెలియజేయువాడు గురువే. (చాంద్యోగ్య ఉపనిషత్)

శ్లో: యంమాతా పితరో క్లేశం సహేతేసంభవే నృణా
నతస్య నిష్కృతిశ్శక్యా కర్తుంవర్షశతైరపి
తయోర్నిత్యంప్రియంకుర్యాదాచార్యస్య చసర్వదా

తా తల్లి దండ్రులు వీనిఉత్పత్తి విషయమునందు మిగుల క్లేశము నొందుదురు. కావున వారికి ప్రత్యుపకారము చేయుటకు నూరుజన్మములెత్తి నప్పటికిని శక్యము గాదు. తల్లిదండ్రులకు ప్రతి దినమును ప్రియము కలుగునట్లు నడుచుకొనవలయును. ఆచార్యుని విషయము నందును సదా ప్రియము కలుగునట్లు నడుచుకొనవలయును. (మనుస్మృతి)

శ్లో: ఆచార్య ఏవ సంసార మోచక ప్రద ఉద్యతే.

తా సంసారమనెడు జనన మరణ దుఃఖమునుండి విడిపించు వాడు గురువేయగును (మహాభారతము - అరణ్యాపర్వము)

శ్లో॥ ఆచార్యస్య ప్రసాదేవమమసర్వ మభీప్సితమ్
ప్రాప్నుయా మితివిశ్వాసో యస్యాస్తి ససుఖీ భవేత్॥

తా॥ ఆచార్యుని యొక్క అనుగ్రహము చేతనేను సమస్త కోర్కెలను పొందగలననెడి విశ్వాసము ఎవనికి గలదో వాడు సుఖమును (మోక్షమును) పొందును. (గురుగీతాసారము -73)

తే॥ ఆత్మతత్త్వంబు తానుగా నరయు కొరకు
జ్ఞానమను నంజనము కండ్లదాను జిల్కి
కరతలామలకము గాంచు కరణి దత్త్వ
రవినిధానము జూపి నిర్మలుని జేయు॥

తా॥ ఓ పార్వతీ ఆత్మతత్త్వము తానని తెలియుటకై జ్ఞానమనెడి అంజనమును కన్నులయందిడికరతలా మలకము వలె ప్రత్యక్షముగాతత్త్వమనెడి పరమాత్మయనెడి సూర్యుని దర్శించునట్లొనర్చి నిర్మలాత్మునిగా నొనర్చును.ఇట్లు సద్గురువు చేయగలడని భావము.

తే॥ భవము నెడబాసి శివయోగ పటిమ జూపి
ముక్తి బొందించివేదాంత మూలమిట్టి
దనుచు దెల్పిన గురుపాద వనజసేవ
సలుపగాలేనిమనుజుని జన్మమేల॥

తా॥ పార్వతీ . జన్మమును -నశింపజేయు నట్టియు, రాజయోగ పద్ధతినితెలియ జేయునట్టియు, మోక్షమును బొందు నట్లొనరించు నట్టియు, వేదాంతమునకు ఆదికారణ మిట్టిదని తెలియజేయు నట్టియుసద్గురు వర్యునిపదకమల సేవ సేయనట్టి

వానిజన్మము నిరర్థకము. అనగా గురు సేవచేయు నట్టి వాని జన్మమే సార్థకమైనదని భావము. (గురుగీతాసారము -73)

సీ॥ గురు కథాశ్రవణ విస్ఫుర హీన కర్ణము
లగిరి కంధరంబులౌ గిరితనూజ
ఘన గురురూపంబు కనలేని నేత్రము
ల్బర్హిపింఛాక్షులౌ పద్మనేత్రి
గురు పాదముల మీది విరితావు లెరుగని
ముక్కు వరహంబు ముక్కుతన్వి
చెలువొప్ప గురుపూజ సేయని హస్తము
ల్కుణ పంకరంబులౌ గుందరదన

తే॥ సద్గురు చరిత్ర చదువని చదువులెల్ల
మండుకంబుల చదువులౌ మధురవాణి
పరమ గురుగాన బోనట్టి పాదములును
బాదంబుల బోలు నో పద్మగంధి

తే॥ ఓ పార్వతీ! పద్మనేత్రీ. వినుము సద్గురువర్యుని దివ్య కథలను వినని యట్టి చెవులు కొండ బిలములగును. సద్గురుని దర్శింపలేని వాని కన్నులు నెమలి పింఛములందలి కన్నులే యగును. గురు పాదములం దర్పింపబడిన పుష్పముల పరిమళమును, ఆఘ్రాణింపని వాని యొక్క ముక్కు పంది ముక్కు యగును. గురువునకును పూజ.సేయని వాని హస్తములు జీవములేని పీనుగు

హస్తములగును. సదాచార్యుని మహిమలను దెలియజేయనట్టి చదువులన్నియును కప్పకూతలగును. సద్గురుని దర్శించుటకు బోని యట్టి పాదములు స్థానులతో సమానమగును.

(గురుగీతాసారము - 74)

చ॥ గురునకొసంగ లేనిసిరి కుంభినిలో గహవాంతరంబునన్
నెరవుగ గాయు వెన్నల విలాసమునే గురుపాద పద్మముల్
మరిగని మ్రొక్కలేని నరు మస్తకమందు కిరీటమారయన్
ధరణిని గాష్ట భారమును దాల్చిన వాని తెఱంగు శైలజా ॥

తా॥ ఓ గౌరీ! గురువున కొసంగని యట్టి సంపద భూమి యందు అడవిని గాచిన వెన్నెలతో సమానమగును. గురు పాదపద్మములకు నమస్కరింపని యట్టి వాని కిరీటము కట్టెలమోపును తలలో మోసికొని యుండుటతో సమానమగును

(గురుగీతా సారము - 74)

శ్లో॥ శరీరం వసు విజ్ఞానం వాసఃకర్మగుణానసూన్
గుర్వర్థం ధారయేద్యస్తు సశిష్యో నే తరస్స్మృతః ।

తా॥ తన శరీరమును, ధనమును, శాస్త్రజ్ఞానమును, వస్త్రములను, కృత్యములను, శుశ్రూషలను, సద్గుణములను, ఆచార్యుని ఉపయోగము కొరకు ఎవడు సమర్పించునో వాడే శిష్యుడగును. ఇతరుడు కానేరడు. (శృతి వాక్యం).

శ్లో॥ ఏకాక్షర ప్రదాతార మాచార్యంయోనమన్యతే
శ్వాన యోని శతం ప్రాప్యం చండాళేష్వపి జాయతే ॥

కర్ణౌత్ర తాపిదాత తవ్యో గంతవ్యం వాతతోన్యతః ॥

తా॥ ఎచ్చట ఆచార్యుని అపవాదము గాని, నిందగాని ప్రస్తావింపబడుచున్నదో అచ్చట చెవులను మూసికొనవలయును. అచ్చోట నిలువక ఆతావును వదలి పోవలయును. (శ్రుతివాక్యం)

క॥ గురుసేవ సేయ బూనను
గురు ఋణమును దీర్ప నాత్మగురిగని నడువన్
హరిధాతాదులకైనను
వెరవిడయని పలుకరాదు విమలేందుముఖీ॥

తా॥ ఓ పూర్ణచంద్ర ముఖియగు పార్వతీ! గురు సేవ సేయుటకును, గురుఋణమును దీర్చుటకును, పరమాత్మ యొక్క స్థితిని దెలిసికొని వర్తించుటకును, విష్ణుదేవునకును, బ్రహ్మదేవునకును, ఉపాయమిట్టిదని వచించుటకు సాధ్యముకాదు. (గురు గీతాసారము - 85)

**(శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల తన యొక్క "శుద్ధ సిద్ధాంత తత్త్వ కందార్థ దరుపులు" అను గ్రంథము నందు పొందుపరచిన)**

## శిష్యుని గురు భక్తిని సూచించు ధర్మములు

# గురు మంత్రానుష్ఠాన విధానమును సూచించు ధర్మములు

శ్లో॥ తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణాః
నానుధ్యాయా న్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనంహితత్॥

తా॥ బుద్ధి మంతుడు బ్రహ్మమును గూర్చి
నిస్సంశయముగ తెలిసికొని దానియందే తైల
ధార వంటి ప్రజ్ఞనుంచ వలెను.
అనేకములగు మాటలను కల్పింపరాదు.దాని వలన
నోటికి శ్రమయేగాని వేరు ఫలితముండదు.
(చూ. బృహదారణ్యక ఉ.ప. 4.4.21.
చూ. ముండక ఉ.ప. 3.1.4
వేదాంత పంచదశి)

శ్లో॥ నియమేవ జపం కుర్యాదకృతౌ ప్రత్యవాయతః
అన్యాధాకరణ్యే నర్థ స్వరవర్ణవిపర్యయాత్॥

తా. జపము చేసినచో నియమ పూర్వకముగ చేయవలెను.
లేనిచో పాపము గలుగును.విపర్యముగ వర్ణము చెరచి
చేసినచో అనర్థమే సిద్ధించును. (వేదాంత పంచదశి)

శ్లో॥ చిత్రికా గ్రం యధాయోగీ మహాయాసేనసాధయేత్
అణిమాది ప్రేప్సయైవం విచిన్త్యోత్స్వంముముక్షయా॥

తా॥ అణిమాది అష్ట సిద్ధులను సంపాదించుటకు యోగి మహా

క్ష్టముతో ఈ చిత్తైకాగ్రతను సాధించును. మోక్షమును సాధించు కోరికతో వివేచనను కూడ అంత పరిశ్రమతో చేయవలెను.

(వేదాంత పంచదశి)

శ్లో॥ అనందాదేర్విధేయస్య గుణసంఘస్యసంహృతిః
ఆనందాదయ ఇత్యస్మిన్‌సూత్రే వ్యాసేన వర్ణితా ॥

తా॥ బ్రహ్మమునుధ్యానించు నపుడు ఆనందము విజ్ఞానము, నిత్యము, శుద్ధము, బుద్ధము, సత్యము, ముక్తము, నిరంజనము, విభువు, అద్వయుము, ప్రత్యక్, ఏకరసము మొదలగు విధేయ గుణములన్నింటిని అన్వయించు కోవలయును.

(చూ. బ్రహ్మ సూత్రములు. 3.3.11.
తైత్తిరీయ ఉ.ప. 3.6.
బృహదారణ్యక. ఉ.ప 3.9.28.
నృసింహతాపనీయ ఉ.ప 9
వేదాంత పంచదశి)

శ్లో॥ ఆప్తోపదేశంవిశ్వస్య శ్రద్ధాలురవిచారయన్
చింతయే ప్రత్యయై రనంతరిత వృత్తిభిః ॥

తా॥ విచారముచేయని శ్రద్ధావంతుడు గురూపదేశమును విశ్వసించి ఇతరములగు ఆలోచనలచే అంతరాయము కలుగనీయక గురూపదిష్టమైన ధ్యేయమునే ధ్యానింపవలయును.

శ్లో॥ యావచ్చింత్య స్వరూప త్వాభిమాన స్స్వస్య జాయతే
తావద్వి చింత్య సశ్చాచ్చ తదైవానువృతి ధారయేత్

తా॥ ధేయముతో తాదాత్మాభిమానము కలుగువరకు ధ్యానించి విడపకూడదు మరణించువరకు ఆ యభిమానమును నిలుపుకొనవలయును.

(మూ. బ్రహ్మ సూత్రములు 4.12. వేదాంత పంచదశి)

శ్లో॥ ఇహ వా మరణే చాస్య బ్రహ్మలోకేథవా భవేత్
బ్రహ్మసాక్షాత్కృతిః సమ్యగుపాసీనస్య నిర్గుణమ్ .

తా॥ నిర్గుణ బ్రహ్మమును చక్కగా ధ్యానించు వాడు ఈ లోకమున గాని, మరణకాలమున గాని, బ్రహ్మలోకమున గాని, బ్రహ్మసాక్షాత్కారము నొందును. (వేదాంత పంచదశి)

17. గురు మర్మమును దేశికుని నోట (గురు వాక్యము మూలముగా) గట్టిగ తెలియవలెను. (కం. సం. 32)

18. బ్రహ్మాండ బాండ నంతములను గురువాక్యము ద్వారా క్షణములో ధ్వంచవలయును (కం.సం.50)

19. ఎఱుకకు మూలములేని రహస్యమును సద్గురునిచే ఎఱుంగ వలెను. (కం.సం. 70)

20. గురు ముఖమున ఎఱుక పరిపూర్ణములను లెస్సగ గుర్తెరుగ వలయును (కం.సం. 122)

21. దిట్టమౌ బోధచేపట్టియెఱుకను తిరిగిపుట్ట కుండగదాని పుట్టి ముంచవలెను. (కం. సం. 155)

22. గురు మంత్రమనియేటి గృద్దాలితోటి యెఱుక కూకుడు వేరు (గురు ముఖమున) ను ఎరిగి త్రవ్వవలెను. (కం.సం. 16 )

23. భ్రమ రూపమైనట్టి బ్రహ్మాండ మెఱుకాల భ్రమ దీసివేసి

భ్రాంతిలేనివాడై (సంకల్పిత రహితుడై) ఉండవలెను.

(కం.సం.173)

24. లేనిది యెఱుక యనుచు లెస్సగ ధృఢమౌ దానుక శిష్యుడు శోడశాక్షరి మహామంత్రమును మానక జపియించవలెను.

(కం.సం. 18.8)

25. ఘనమైన పూర్ణబోధను చచ్చిన దాక నిదుర వచ్చు దాక మరువకూడదు. (కం.సం.258)

26. సద్గురుని నోటిమాట (గురు వాక్యము) వెంబడి సంచరింప వలెను. (కం.సం.288)

## ఆత్మవిచారము చేయు విధానమును సూచించు పద్యములు

శ్లో॥ యథాగాధ నిధేర్లబ్ధానోపాయః ఖననం వినా
మల్లాభేసి తథా స్వాత్మ చింతాం ముక్త్వా నచాపరః

తా॥ భూగర్భమున నున్న నిధిని పొందవలెనన్న త్రవ్వుట తప్ప మరొక యుపాయము లేదు. అట్లే ఆత్మను పొందవలెనన్నను - ఆత్మ చింతన తప్ప వేరొక యుపాయము లేదు.

(చూ. వివేక చూడామణి - 65)

శ్లో॥ కావ్య నాటక తర్కాదీ మభ్యస్యతి నిరంతరమ్
విజిగీషుర్యథా తద్వన్ముముక్షుః స్వం విచారయేత్

తా॥ ప్రతి స్పర్థులను జయింప గోరు పురుషుడునిరంతరము కావ్యమునాటకములు, తర్కము మొదలగుశాస్త్రములు నభ్యసించునట్లే ముముక్షువు సర్వదా ఆత్మవిచారము

నభ్యసింపవలెను. (వేదాంత పంచదశి)

శ్లో॥ అత్యంత బుద్ధిమాంద్యాద్వా సామగ్ర్యా వాప్య సంభవాత్
యో విచారం న లభతే బ్రహ్మోపాసీత సోనిశమ్ ..

తా॥ మిక్కిలి మందబుద్ధిచేగాని, పరిస్థితులు అనుకూలింపక పోవుట వలన గాని, విచారము సాధ్యము కానిచో అట్టి ముముక్షువు నిరంతరము బ్రహ్మమునుపాసింప వలెను. (వేదాంత పంచదశి)

శ్లో॥ అనుభూతేర భావేపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్
అప్య సత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః ..

తా॥ అనుభవము లేకున్నను నేను బ్రహ్మముననియే ధ్యానింపుము. ధ్యానము వలన ఇతరములు (దేవతాదులు) లభ్యమగు చుండగా నిత్య సిద్ధమగు బ్రహ్మమేల లభింపదు ? అవశ్యము లభించును. (వేదాంత పంచదశి)

శ్లో॥ వాసనానేక కాలీనా దీర్ఘకాల నిరంతరమ్
సాదరం చాభ్యస్యమానే సర్వదైవ నివర్తతే ॥

తా॥ బ్రహ్మాభ్యాసమును శ్రద్ధతో నిరంతరముగ దీర్ఘకాల మభ్యసించినచో బహుకాలము నుండి మనస్సునందున్న ప్రాపంచిక వాసన సర్వధా నశించును. (వేదాంత పంచదశి)

శ్లో॥ ఆత్మ బ్రహ్మ విచారాఖ్యం శాస్త్రీయం మానసం జగత్
బుద్ధేతత్త్వే తచ్చహేయమితి శ్రుత్యాను శాసనమ్ ॥

తా॥ ఆత్మ స్వరూపము బ్రహ్మమేయను విచారము, శ్రవణ, మనన,

నిధి ధ్యాసనాత్మకము, శాస్త్రీయమైన మానస జగత్తు తత్వము, బోధపడిన పిమ్మట దీనిని కూడ పరిత్యజింప వలెనని శ్రుతి శాసించుచున్నది. (వేదాంత పంచదశి)

శ్లో|| శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్య చ పునః పునః
పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్ ||

తా మేధావి యగు పురుషుడు శాస్త్రములను చక్కగా అధ్యయనము చేసి అందు బోధింపబడిన విషయమును శ్రద్ధతో నభ్యసించి బ్రహ్మత్వబోధను పొందిన పిమ్మట ఆశాస్త్రములను కూడ, గమ్యమును చేరిన యాత్రికుడు చేతి దివ్వెను పారవేసినట్లు వదలవలెను.

(చూ. అమృత నాదోపనిషత్తు ; వేదాంత పంచదశి)

27. బయలున్నది తెలిసి, తెలిసిన యీ తెలివిని, తెలివి చేతనే పట్టి తీసివేయవలెను. (కం.సం. 51)

28. కుర్తు వొచ్చి హెచ్చి చచ్చు లోపలనే బట్టబయలును ఎఱుగవలెను. (కం.సం. 52)

29. పరిపూర్ణ మొకటి దక్క నితరమైన ప్రపంచ మెల్ల ఎరుకేనని మదిలో తెలియవలెను. (కం.సం. 57)

30. ఎఱుక నెడసిన తాపసులను పాపపుణ్యములు ప్రాపింపవని చిత్తమందు తెలిసి వాటికై భ్రమనొందరాదు. (కం. సం.58)

31. శిష్యుడు అమలిన మనస్కుడై పర బ్రహ్మ ప్రాప్తికై విచారించవలెను.

(కం.సం. 74)

32. ఆవరణముననేనిరావరణమును జూడవలెను (కం.సం. 80)

33. తన చిత్తములో జగము,నెఱుకను, ఉత్తబయలును ఊహతో తెలిసి, ఊహ, జగములను విడువ వలెను. (కం.సం. 94)

34. గురు ముఖమున బయలెరుకల నెఱి, ఎరుకను తీసివేయవలెను. (కం.సం.98)

35. సచ్ఛిష్యుడైన వాడు గురుబోధయనే గొడ్డలి చేబూని దేహము, దేహిలరెంటినివిచారణచేతమూలములేనివని దృఢపడవలెను. (కం.సం. 103)

36. సత్యముగు దేవుని (బయలు) యందుతన్నుతాను వెదక వలెను (కం. సం. 110)

37. పరిపూర్ణ బోధ మర్మము ఎఱుగుటకై క్రమ మెరిగిన వాడై యుండవలయును. (కం.సం. 129)

38. మలినము లేనట్టి వివేక ఘనుడు యెఱుక చేత అచలమును కనుగొని, యెఱుగే ఎఱుక మానటమే బోధ క్రమముగా గుర్తెరుగ వలయును. (కం.సం. 131)

39. ఉదయాస్తమానములుడుగక ఎఱుక లేనిదని, బయలుఉన్నదని తననెమ్మదిలోననమ్మియుండవలయును. (కం.సం. 160)

40. కను పాపలో గల వస్తువేపరమాత్మయని యెఱుగ వలయును. (కం.సం. 163)

41. అతులిత గురుకృపగలిగిన మతిమంతుల (శిష్యుల) జూచినచో

యెఱుక నిర్వాదనిమదిలో సంశయము వుంచక నమ్మవలెను.
(కం.సం. 164)

42. ఎఱుక గురు మంత్రముచే నిలువనిదని గురు ముఖమున ఎఱుగవలెను. (కం.సం. 166)

43. వాద భేదము లేనివారిచే యెఱుక యొక్క పాదు (మూలము) పెకలించేటిపద్ధతి (శోడశిభావమును) నెరుంగ వలెను. (కం.సం. 174)

44. యే ప్రొద్దునను మరువక గురుమంత్రమును (శోడశిభావమును) స్మరణజేసినచో తిరిగి పుట్టువని తెల్పవలెను. (కం.సం. 178)

45. ఎఱుకను యే ప్రొద్దునను దల్చక యుండటమే గురు బోధయని యెఱుగ వలెను. (కం.సం. 184)

46. పరిపూర్ణము ఎఱుకలను యెరిగి యామీదట యెఱుకను విడుచుటే గురుబోధయనుచు ఎఱుగ వలయును. (కం.సం. 186)

47. స్వప్నోద్యోగమునకు నేనే కారణమని అనిమిషుడు (శోడశిభావ సంపన్నుడు) ఎన్నడు అనుకోకూడదు. (కం.సం. 195)

48. సద్గురు బోధను వేమారుగురుని నోట వినవలెనునిత్యము నమ్మిచదువు కొనవలెను. (కం. సం. 199)

49. దేశికేంద్రుడు తెల్పనిచో పరిపూర్ణబోధను తన చాతుర్యమున సాధించ నలవి గాదని శిష్యుడు తెలియవలెను. (కం.సం. 208)

50. ప్రవినులయైన చిత్తము గల శిష్యుడు సవినయమున దేశికునకు శరణాగతుడై త్రివిధ ప్రసాదముల గొనిభవనాశ్నితులు లేని

పద్ధతి వినవలెను. (కం.సం. 209)

51. సచ్ఛిష్యుడు మోక్షాది ఆపేక్షలను రోసినవాడైయుండవలెను (కం.సం. 215)

52. సచ్ఛిష్యుడు (పరిపూర్ణ స్థితి నొందదలచినవాడు) ద్వాదశాక్షరి శోడశాక్షరి మహామంత్రములను (మంత్రము, మంత్రార్థము గూఢార్థము, పరము గ) అరసి ఆపైనీరెండు మహామంత్రములను విడువ వలెను. (కం. సం. 225)

53. తను, మన, ధనములు సద్గురునకు వినయముగ ధారబోయవలయును. (కం.సం. 232)

54. గురు వాజ్ఞయివనిదె గురువై శిష్యుల గూర్చి గురుబోధ తెలుపుట గురువంచకుని లక్షణమని శిష్యుడెరుగవలెను. (కం.సం. 236)

55. శిష్యుడు విననేర్చి, ఆపై చెప్ప నేర్వవలెను (కం. సం. 258)

56. సద్గురు బోధ మర్మము (గోప్యము) గురునిపల్కు (మంత్రము మదిలోననాటిన శిష్యుడే ఎరుగునని తెల్యవలెను. (కం.సం. 29[illegible]

## దేశికేంద్రులు నిర్దేశించిన పక్షితుని ఆశయములు

శ్లో॥ చిత్తమేవ హి సంసారస్త త్ప్రయత్నేన శోధయేత్
యచ్చిత్తస్తన్మయో మర్త్యో గుహ్యమేతత్సనాతనమ్

తా॥ చిత్తమే సంసారము దానిని అతి ప్రయత్నముతో అభ్యాస వైరాగ్యములతో రజస్తమస్సులను కల్మషములను తొలగించిఏకాగ్రముచేయవలెను. ఏలన, చిత్తము దేనియందు లగ్నమై, యుండునో తనను దానినిగనే మర్త్యుడుభావించుకొనును

ఇదియే అనాదిసిద్ధమైన రహస్యము. (వేదాంత పంచదశి)

శ్లో॥ అవిద్యదనుసారేణ వృత్తర్బుద్ధ స్యాయుజ్యతే
స్తనంధయానుసారేణ వర్తతే తత్పితా యతః॥

తా॥ ఇంకను చనుబాలు వదలని శిశువుల ఇష్టానుసారము తండ్రి నడచుకొనునట్లు, అజ్ఞానుల ఇష్టానుసారము కృపాళుపైన జ్ఞాని నడుచుకొనుట తగినదే. (వేదాంత పంచదశి)

57. సద్గురుని పాదసేవ సిద్ధించుటకైశిష్యుడు ఆసక్తుడై యుండవలయును. (కం.సం.27)

58. శిష్యుడు విపరీత బుద్ధి విడిచిగురుకృప కలుగుటకై గురునకు ఉపచారములు చేయుచు బయలునపరోక్షను జేసుకోవలెను. (కం.సం.[illegible])

59. సచ్ఛిష్యుడు లక్షణయుతుడై లక్ష్యార్థము నొందుటకై (పరిపూర్ణ స్థితినొందుటకు) లక్షించినవాడై (లోతెరిగి) ఉండవలెను. (కం.సం. [illegible])

60. ఎఱుక నిరసనాసక్తుడైన శిష్యుడు నిరతముగురుసేవ పరతంత్రుడగుచు తత్కరుణకు పాత్రుడైఉండవలెను. (కం.సం. 155)

61. హృదయ గ్రంథి విడుటకైగురుపదయుగళమును చిత్తములో వదలక భ్రాంతిరహితా సక్తుడై తలపవలెను. (కం.సం. 248)

62. అభిమానము లేనివాడై బోధస్థితి కుదురుటకు సమ్మతితో గురుసేవ జేయవలెను. (కం.సం.262)

53. ఎఱుకయును విచ్చేటి చింతను (ఎఱుకను విచ్చేచింత) చాలించుకొని సద్గురుడు బోధించిన బోధాగ్నిచేత తక్కిన బోధల దిక్కు జూడక సాధించవలెను. (కం.సం.265)

**శ్రీవారు ఆదేశించినసద్గురు బోధ ధర్మ -కర్మములు**

శ్లో॥ పామరాణాం వ్యవహృతేర్వరం కర్మాద్యనుష్ఠితిః
తతోపి సగుణాపాస్తిర్నిర్గుణోపాసనా తతః ॥

తా॥ పామర జనులవలె వ్యవహరించుట కంటె శాస్త్ర విహిత కర్మల ననుష్ఠించుట యుత్తమము. కర్మానుష్ఠానము కంటె సగుణోపాసనము శ్రేష్ఠము. దాని కంటె నిర్గుణోపాసనము సర్వ శ్రేష్ఠము. (వేదాంత పంచదశి)

శ్లో॥ యావద్విజ్ఞాన సామీప్యం తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే
బ్రహ్మజ్ఞానాయతే సాక్షాన్నిర్గుణోపాసనం శనైః ॥

తా॥ బ్రహ్మ జ్ఞానమునకు సమీపతరమగు కొలది ఆసాధనము యొక్క శ్రేష్ఠత ఇనుమడిచుచుండును. నిర్గుణోపాసన కాల క్రమమున సాక్షాత్తుగ బ్రహ్మజ్ఞానమే యగును. (వేదాంత పంచదశి)

శ్లో॥ ఉభయం తత్వబోధాత్ ప్రాజ్ఞ నార్యంబోధ సిద్ధయే
శమః సమాహితత్వం చ సాధనేషు శ్రుతం యతః ॥

తా॥ తీవ్రము, మందము అనేరెండు విధములైన జీవ సృష్టియగు అశాస్త్రీయ ద్వైతమును తత్వబోధకై ప్రయత్నించుటకై పూర్వమే పరిత్యజింపవలెను. బోధసిద్ధికి శాంత స్వభావము, ఏకాగ్రత సాధనములుగ చెప్పబడినవి. అశాస్త్రీయ ద్వైతమును వదలనిచో

నీసాధనములు సిద్ధింపవు. (వేదాంతపంచదశి)

శ్లో॥ తత్త్వం బుద్ధ్వాపి కామాదీన్నిః వేషం నజహాసిచేత్
యథేష్టాచరణం తేస్యాత్కర్మశాస్త్రాతి లంఘినః॥

తా॥ తత్త్వమును తెలిసికొనిన పిమ్మట కూడ కామాదులను సమూలముగ పరిత్యజింపనిచో కర్మ శాస్త్రమును నుల్లంఘించు నీవు స్వేచ్ఛాచారి వగుదువు. నిజమగు జ్ఞాని విధి నిషేధముల కతీతుడైనను శాస్త్ర విరుద్ధముగ ప్రవర్తింపడు.
(చూ. భాగవతము. 11.7.11; కఠోపనిషత్తు 2-24, వేదాంత పంచదశి)

శ్లో॥ బుద్ధాద్వైత స్వతత్త్వస్య యథేష్టాచరణం యది
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోశుచి భక్షణే॥

తా॥ నిజస్వరూపమైన అద్వైత బ్రహ్మమునితెలిసికొనిన వాడు స్వేచ్ఛాచారియైనచో నమేధ్యమును తినుటయందు కుక్కకును, ఈతత్త్వదర్శికిని ఏమిభేదము ? నియమములను పాటింపకయే తాను బ్రహ్మజ్ఞాని నని నటించువాడు అమేధ్యమును తినుకుక్కవంటివాడని సురేశ్వరాచార్యులందురు.
(చూ.నైష్కర్మసిద్ధి 4.62;వేదాంతసారము223 వేదాంతపంచదశి)

శ్లో॥ అవిరోధిసుఖే బుద్ధిః స్వానందే చగమాగమౌ
కుర్వన్నాస్తే క్రమాదేషా కాకాక్షి వదితస్తతః॥

తా॥ ఆటంకములు కాని సుఖములను పరమానందమును ఒకటికొకటిగ ననుభవించు తత్త్వవిధుడు ఇటునటు చూచుచుండు కాకివలె

నుండును. సాత్విక సుఖములు బ్రహ్మానందమునకు ఆటంకటములు కావు. రాజసిక,తామసిక సుఖములు బ్రహ్మానందమునకు శత్రువుల వంటివి. (వేదాంత పంచదశి)

శ్లో॥ ఏకైవ దృష్టిః కాకస్య వామదక్షిణ నేత్రయోః
యాత్యాయాత్యేవ మానందద్వయే తత్వవిదోమతిః ॥

తా॥ కాకికి ఉన్న చూపు ఒకటియే.అదికుడి కంటినుండి ఎడమ కంటికి, ఎడమ నుండి కుడికి వచ్చుచు పోవుచుండును. అట్లే తత్వవిదునిమనస్సు సాత్విక సుఖము, బ్రహ్మ సుఖముల యందు తిరుగుచుండును. (వేదాంత పంచదశి)

64. సచ్ఛిష్యుడు సుగుణములు కలిగియుండును. (కం.సం.5)

65. పెద్దలను ప్రేమతో పొగడవలెను. (కం.సం. 6)

66. గురునకు మనస్సు నర్పణజేసిసద్గురుబోధ వినవలెను. (కం.సం. 9)

67. పెద్దలాజ్ఞను మదిలోపల ఉంచుకొని కార్యములు జేయవలెను. (కం.సం. 9)

68. ఎల్లవేళలందు సద్గురుని సన్నిధానమందే యుండవలెను. (కం. సం. 10)

69. సద్గురువు జదివినచో (బోధించినచో) చెవి యొగ్గి వినవలెను. (కం.సం. 12)

70. శిష్యుడైనవాడుఅందముగ చిత్తమునందు గురువుమూర్తినే

తలపోయవలెను. (కం.సం. 12)

71. బుద్ధిమంతుడైన దీక్షితుడు సద్గురుని తలంపు తెలిసి మసలవలెను. (కం.సం. 17)

72. అష్టాంగయోగముల సాధించి అష్టసిద్ధులునొందు కాంక్షను వీడవలెను. (కం.సం. 22)

73. యేసాధనల (అష్టాంగయోగముల) జోలినేనొల్లనని సద్గురునకు బాస జేసిన వాడై యుండవలెను. (కం.సం.24)

74. సద్గురు వాక్యమును మదిలో నమ్మి చంచలబుద్ధి మాని యుండవలెను. (కం.సం. 26)

75. గురువాజ్ఞను మీరకపరీతి వినుమన్నఆరీతి వినవలెను. (కం.సం. 27)

76. నూటి కొక్కటే శేలు యున్నట్లు సద్గురుని వాక్యము పట్ల అచంచల విశ్వాసముంచవలెను. (కం.సం. 29)

77. సద్గురుని వాక్యము పట్ల దృఢవిశ్వాసముతో గురికల్గి యుండవలెను. (కం.సం.42)

78. నిబద్ధియైన శిష్యుడు సద్బుద్ధిని కల్గియుండవలెను. (కం.సం.46)

79. శిష్యుడు సత్కీర్తిమంతుడు కావలెను. (కం.సం. 47)

80. సద్గురు బోధను మదిలో అనుమానముంచక వినవలెను. (కం.సం. 50)

81. సద్గురుని నోట ఎఱుక పుట్టువు తెలిసి సంశయరహితుడై సత్యమును నమ్మియుండవలెను. (కం.సం. 69)

82. ఎఱుకకు మూలము కలదన్న భ్రాంతి నంటని వా యుండవలెను. (కం.సం.83)
83. సచ్ఛిష్యుడు గురుమంత్ర సిద్ధుడై యుండవలెను. (కం.సం. 84
84. బయలు నందు లేని మేనెరుకలను లేనివనుచు గట్టిగ నమ్మవలెన (కం.సం. 85
85. సచ్ఛిష్యుడైన వాడు ఎఱుకతో (ఎఱుకైనవారితో) పొంద వదలవలెను. (కం.సం. 93
86. పరులు నేనని యేటి పలుకు లేకుండునట్లుండ వలెన (కం.సం.98)
87. శిష్యుడు ఎల్లవేళల యందు బయలునందు భావన (తలంపు యుంచిన వాడై యుండవలెను. (కం.సం. 102)
88. సచ్ఛిష్యుడైన వాడు చపలత జెందే [illegible]ని వాద భేదమ లేనివాడై ప్రతిలేని బట్టబయలుఉండజా[illegible]. (కం.సం. [illegible]
89. అన్యుల (అన్యమతములవారి) బోధ వినకుండగ అచల గురుడ తెల్పిన బోధను విడువని వాడై యుండవలెను. (కం.సం. [illegible]
90. ఎఱుక సాధనలతో (అష్టాంగ యోగములతో) సాంగత్యమ లేక యుండవలెను. (కం.సం.[illegible]9)
91. చతురాక్షరియే ఎక్కువైనది అనేంతటి చంచల మనస్కుడ కాకూడదు. (కం.సం. [illegible]2)
92. ఎఱుకైన వారితో (విషయాసక్తులతో) పొందుకూడదు (కం.సం. 2[illegible]8)
93. యెందరి మాటల నెన్నిన గాని నా బోధ (మద్గురుమూ

బోధించిన) క్రిందివే యనే దృఢము కల్గి యుండవలెను
(కం.సం.5)

94. అనుమానము లేనివాడై అచల గురుమూర్తి బోధించిన రీతిని పరబయలును గనవలెను. (కం.సం.116)

95. లేనట్టి ఎఱుకను కలదని లేనిమాటలాడరాదు. (కం.సం. 121)

96. బయలున్నదరసి మూలము లేని బింద్వాదికంబుల పేరు దలువగూడదు. (కం.సం. 123)

97. యెఱుకను వినబోక కనబోక విడిచిపెట్టవలెను. (కం.సం. 124)

98. కల-మేల్కొలు, ఎఱుక - బయలులకు సామ్యము జేసి చూచి తన భ్రమ దొలగించుకోవలెను. (కం. సం. 127)

99. చదువుల వలనను, జప, యాగ, యోగ, వ్రతముల వలనను, శమ, దమ, సుఖ, శతముల వలన ఫలము లేదని గ్రహించవలెను. (కం.సం. 127)

100. సద్గురు బోధ బడసిన తర్వాత శ్రీవనితేశ రాజీవ సంభవ భవదేవేంద్రాదులను సేవించు తలంపు మానవలెను. (కం.సం. 135)

101. బట్టబయలును నేనెన్నడు తెలిసితినని యనకూడదు. (కం.సం. 136)

102. సత్యమగు బట్టబయలును, అసత్యంబగు యెఱుకను సద్గురు కృప చేత ఎరిగి, యెఱుక సత్యము గాదనిన్ని, బయలు సత్యమనిన్ని, నమ్మియుండవలెను. (కం.సం. 149).

103. పరిపూర్ణముగా [illegible]చినయెఱుకే కల, లేని యెఱుకను మ్మ

షయని నెరిగి, ఈ మరుగు ఎఱుకకు ఎఱుక దెల్పిన ఎరుగటమే మేల్కొమని తెల్సి యామారక యుండవలెను.(కం.సం. 15[illegible])

104. సద్గురు వాజ్ఞకుఎదురు మీరకూడదు. (కం.సం. 25[illegible])

105. ఉన్న పరిపూర్ణమును గని, లేని ఎఱుకఎన్నడు లేదని యెరిగితే చాలును (కం.సం. 152)

106. దినదినమభివృద్ధి తనువు చేత బయలును గని యా మాయల మల్లి కథ మూయించవలెను. (కం.సం. 155)

107. గురుని చేత ఎఱుకను వదలిన వారిని కల వారించని, అరయక నోట పలికిన వారికి పాపము తొలగదని గ్రహించవలెను. (కం.సం. 158)

108. సచ్ఛిష్యుడైన వాడు నిరుపమానమైన బుద్ధిగలవాడై యుండి,నిగమ ప్రసిద్ధుడుగావలెను. (కం.నెం. 15[illegible])

109. చూపులలో గల వస్తువు,చూపులగను వస్తువులును, చూపులు గూడయెఱుకయే యనితెలియవలెను. (కం.సం.153)

110. సద్గురునిచే మేల్కొంటేతిరిగి పుట్టనే పుట్టననే (గుఱుతు ఉండదనే) దృఢ నమ్మిక ఉండవలెను. (కం.నెం. 155)

111. గురుబోధవిననిమీదట మునుపు కలిగిన యెఱుక మొదటికే (మూలముననే) నిర్వానిదై ఉండవలెను. (కం.నెం. 1[illegible])

112. ఉన్నది పరిపూర్ణము, లేందెన్నటికీయెఱుకయనిధృఢమౌదాక సద్గురు బోధను యెన్నవలయును. (కం.సం.189)

113. కుమతులు వచ్చి తనలోతు అడిగినగానివారికిఎన్ని విధముల గూడ

ఎరిగింప కూడదు. (కం.సం.189)

114. సద్గురుబోధను సామాన్యంబనుచు జూడవలదు. (కం.సం. )

115. ఇతర శాస్త్రముల జోలి వదలవలెను. (కం.సం.204)

116. శ్రీమద్ భాగవత కృష్ణదేశికేంద్రులు పరిపూర్ణము, ఎఱుకలను పరిశోధించి రచియించిన (కారణతనువు అనే) శుద్ధ నిర్గుణత్వ కందార్థ దరువులు అనే గ్రంథమును మరువక చదువవలెను. (కం.సం. 203)

117. శిష్యుడు పనులు చాలించినవాడై ఈ (స్థూలాదిమహాకారణ పర్యంతము గల తను గ్రంథమును) 292 కందార్థములు గల గ్రంథమును కొనవేళ్ళగా సంకోచింపక చూడవలెను. (కం.సం. 205)

118. మంత్ర తంత్రముల యొక్క మర్మము గురునిచే తెలియవలెను. (కం.సం. 211)

119. సద్గురు బోధను వినిన తర్వాత వెనుకటితన చేష్టలను పాటించి కనరాదు. (సం. నెం. 215)

120. సకల జనుల సమ్మతిగా నడువ లేక పోతినేయని వికల మనస్కుడైవెత నొందరాదు. (కం.సం. 217)

121. శిష్యుడుకలలోనైనదుష్టుల చెంత జేరక యుండి కలనైన శిష్టుల చెంత వదలకుండ వలెను. (కం.నెం. 218)

122. సచ్ఛిష్యుడైనవాడు గురుమూర్తిబోధించుట మానినగాని, తద్బోధను పూనినవాడై తాను మాత్రము మానకుండవలెను. (కం.సం.235)

123. సచ్ఛిష్యుడైనవాడు గురుమూర్తి కెదురహం కృతి దొరకొనరాదు.

దొంగత్రోవ త్రొక్కరాదు. చెవులగురునింద వినగరాదు. మరియు చేయగా రాదు. (కం. సెం. 24[illegible])

124. గురుమూర్తిచే తాను తెలియకయే పుస్తకరీతిచే పూర్ణమరసితినని మురియుట తగదు (కం. సం. 24[illegible])

125. గురుపుత్రులను ఆదరణయొనర్పవలయును (కం. సెం. 244)

126. గురువును విడనాడి రెండో గురుని జేరగరాదు. (కం.సం. 244)

127. సద్గురు బోధ నెరి[illegible] దూరకూడదు. కం.సం.244)

128. శిష్యుడు ద్రవ్యలోభ మగ్నుడై గురువును ఆదరించక యుండరాదు. (కం. సం. 248)

129. సద్గురుని దగ్గర బోధనెరుగు సమయాన శిష్యుడు లజ్జింప తగదు. (కం.సం. 25[illegible])

130. అభిమానము లేనివాడై గురుని సమ్మతితో సంశయముల నడి[illegible] తెల్సుకొని బోధస్థితి ధృఢపరచుకోవలెను. (కం. సం. 263)

131. తన మానసమున ఏమాత్రము సంశయము నిలుపరాదు. (కం.సం. 263).

132. పెద్దల నింద యొనర్ప కూడదు. (కం.సం.257)

133. పెద్దల సేవించుకొరకు పెరిదివియ కూడదు. (కం.సం.257)

134. పెద్దలతో వాదించ కూడదు (కం.సం. 257)

135. పెద్దలు జెప్పేటి సుద్దులు పెడ చెవుల వినకూడదు. ,,

136. పెద్దలు నడిచే నడక నేమన కూడదు. ,,

137. పెద్దల కన్న నే పెద్దననుకో కూడదు ''

138. పెద్దల కనుగొన్నచో వినయముతో మ్రొక్కవలెను ''

139. చిత్తములో చిన్నతనమేమేలని తెలియవలెను (కం.సం. 258)

140. సచ్ఛిష్యుడు ఓపిక కల్గియుండవలెను. (కం.సం. 286)

141. సచ్ఛిష్యుడు సంప్రదాయములో నిష్ఠను కల్గియుండవలెను. (కం.సం. 287)

142. యేనరుడైన తనను సద్గురు బోధ నడిగితే వాని మనసరయక వానికి జూపకూడదు. (కం.సం. 288)

143. సద్గురు దేవునిపాదములపైఆననిడినవాడై మేను యెలుకలను తిరి చూడరాదు. (కం..సం. 175)

## అహం రహిత పరిపూర్ణాచల బోధ దృఢపడుటకు శ్రీవారు దీక్షితునకు సూచించిన లక్షణములు

శ్లో॥ *ఉత్సేక ఉదధేర్యద్వత్కుశా గ్రేణైక బిందునా*
*మనసో నిగ్రహస్తద్వద్భ వేదపరి ఖేదతః .*

తా॥ దర్భ వెయినచే ఒక్కొక్క బిందువుగా సముద్ర జలమునుతిరుగదోడుటకు ఎట్టి పట్టుదల నిర్విరామమైన ప్రయత్నము ఆవశ్యకమో అట్టి ఖేదములేని ప్రయత్నము వలన మనో నిగ్రహము సాధ్యమగును.

(చూ. గౌడ పాదకారిక 3.41; వేదాంత పంచదశి)

శ్లో॥ సోకామో నిష్కామ ఇతిహ్యశరీరో నిరింద్రియః
అభయంహీతి ముక్తత్వం తాపనీయే ఫలం శ్రుతమ్ ॥

తా॥ బ్రహ్మమును ధ్యానించుఉపాసకుడు, అసంగము కామనారహితము అశరీరము ఇంద్రియరహితము అభయము అగు బ్రహ్మమే యగునని నృసింహ ఉత్తర తాపనీయ ఉపనిషత్తు (5,7,8) చెప్పు చున్నది. (వేదాంత పంచదశి)

శ్లో॥ నిర్గుణో పాస్తి సామర్థ్యాత్తత్ర తత్త్వమ వేక్షతే
పునరావర్తతే నాయం కల్పాంతే చ విముచ్యతే ॥

తా॥ నిర్గుణో పాసనా బలమున బ్రహ్మలోకమునతత్వజ్ఞానము పొందును. అతనికికపునర్జన్మ లేదు. కల్పాంతమున విముక్తుడు కూడనగును. (చ. చాందోగ్య ఉప 4.15; 5; 5.10.2)

శ్లో॥ ధీరత్వమక్షప్రాబల్యే ప్యానందాస్వాదవాంఛయా
తిరస్కృత్యాఖిలాక్షాణి తచ్చింతాయాం ప్రవర్తనమ్ ॥

తా॥ ఇంద్రియము లెంత తీవ్రముగ విషయములను వాంఛించినను వానినితిరస్కరించి సకలేంద్రియములను బ్రహ్మ చింతయందే నిలుపుట ధీరత్వమన బడును. (వేదాంత పంచదశి)

శ్లో॥ తదభ్యాసేన విద్యాయాం సుస్థితాయామయం పుమాన్
జీవన్నేవ భవేన్ముక్తో వపురస్తు యథాతథా ॥

తా॥ అభ్యాసముచే అట్టి బ్రహ్మవిద్యయందు సుస్థితుడైన పురుషుడు జీవించియుండగనే ముక్తుడగును. ఇక అతని శరీరము ఎట్లుండిన నేమి ? (వేదాంత పంచదశి)

౩. ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్ స్వప్న సుషుప్తిషు
స్థాన త్రయ వ్యతీతస్య పునర్జన్మ నవిద్యతే.

జాగ్రత్ స్వప్న సుషుప్తుల యందున్న ఆత్మ ఒకటియె యని భావింపవలెను. తాను ఈ మూడు స్థానములకును అతీతమని తెలిసికొనిన ఆత్మకు పునర్జన్మ లేదు.

(చూ. అమృతబిందు ఉప. 11, వేదాంతపంచదశి)

4. బట్టబయలు యిది యని దృఢముగ వరకు సంపూర్ణము ఎఱుక లేమిని సేవింప (పూజింప) వలెను. (కం.సం. 52)

5. పరిపూర్ణమైనట్టి బయలు "ఉండ"గనిపెట్టి గురునీ వాక్యము బట్టిగురుతుబోగొట్టవలెను. (కం.సం. 89)

6. సద్గురు బోధ నెరిగిన నరుని (శిష్యుని యొక్క) చేష్టలు గనిన ఉళ్ళుక్కిగావలెను. (కం.సం. 95)

7. సద్గురుని కరుణబడసిమేలుకచేకొని కల (ఆత్మస్వరూపమయిన ఎఱుకను) కల్ల జేసి పరిపూర్ణపర బాహ్య పదవి నందవలెను.

(కం.సం. 129)

8. వేదనుచు ఎరిగేనాలవ శరీరముతో అంటట నిండిన బయలునుకనుగొని, ఆ బయలు నందు లేని ఈ తనువును తుడువు జేయక విడనాడవలెను. (కం.సం. 143)

9. పరిపూర్ణ బోధ చేత ప్రపంచ, శరీరముల యొక్క రూపము లెడబాపవలెను. (కం.సం. 145)

10. ప్రతిలేని గురుబోధ స్థితి జెంది, యెఱుకను తిరి సంగ్రహించ

కూడదు. (కం.సం. 179)

151. అదుగో పరిపూర్ణుడను అని పలుకుచున్న యెఱుక యనే బలుపైన (అధిక తరంగవిష్టైన) అక్షరముల చేత స్థిరమైన బయలును కనుగొని యెఱుకను స-మూలముగ కట్టిపెట్టవలెను. (కం.సం.183)

152. పరులు నేనని యేటి భావము - అభావమైన వాడై నిరతము ఒకచోటి నిలుచుండవలెను. (కం.సం. 190)

153. యెఱుకను విడనాడిన పురుషుడు (శిష్యుడు) సమరస బుద్ధి చేత సరిపడు సరిపడ దనక సరిగా వర్తింపవలయును. (కం.సం.194)

154. పరిపరి విధముల పరువుల బెట్టక, వైరాగ్యము చేత మానుకొనుండక సహజ ప్రవృత్తి చేత కార్యములు చేయవలెను. (కం.సం. 195)

155. పరిపూర్ణ స్థితి కలిగిన నేరుపుశాలి (శిష్యుడు) యితర జనుల నిందాస్తుతులను తాను రేగి చేయకూడదు. మరియు వారలు చేసినచో వలదని యనకూడదు. (కం.సం. 197)

156. పరిపూర్ణ యెరుకలెట్టివో గురుముఖమున రెంటిని లెస్సగ గుర్తెరిగి ఎఱుకను మృషయని సరిపుచ్చుకోవలెను.

## పక్షితుని యొక్క గురు సాంప్రదాయ ధర్మవిస్తరణ కాంక్షను సూచించు ధర్మములు

శ్లో: యేనాయం నటనే నాత్ర బుద్ధ్యతే కార్యమేవతత్
అజ్ఞ ప్రభోధాన్నా వాన్యత్కార్య మస్త్యత్ర తద్విదః
తా అజ్ఞానులతో వారికి జ్ఞానోదయము కలుగునట్లుగ జ్ఞాని ప్రవర్తింప వలెను. అజ్ఞానులకు బోధ కలిగించుట తప్ప జ్ఞానులకు ఈ లోకమున కార్యమేమియు లేదు. (వేదాంత పంచదశి)

57. క్రమించు అచల బోధను భూమిన్ సుజనుల కొరకు యోగజల్లవలెను. (కం.సం. 5)

58. సచ్ఛిష్యుడు సద్గురు బోధ ప్రయుక్తుడు కావలెను. (కం.సం. 8)

59. పరిపూర్ణ పరబయలును దర్శించిన శిష్యుడు ఎఱుక అందు లేదని నిర్ణయముగ చాటవలెను. (కం.సం. 75)

60. సద్గురూక్తమైన సద్గురు బోధను సుజనుల మ్రోల పలుకను వెరువకూడదు. (కం.సం. 189)

61. శిష్యుడైన వాడు మంత్రము, తంత్రంబు రెండు గూడు కొని కార్యాచరణమునకుపూనినవాడై కార్యములు జరిగించ వలెను. (కం.సం. 2[illegible])

62. జన వితతి శరణు శరణు యని సద్గురుని దరిజేరునట్లు ఘనమైన యుక్తి జేసిన వాడే శిష్యుడని తెలియవలెను. (కం.సం. 255)

63. గురు సూచనైన నరులను మరిమరి వినుమనుచు పద్యములను చదువవలెను. (కం.సం. 272)

64. సచ్ఛిష్యుడు భవనాశ స్థితి లేని పద్ధతిగల అహం రహిత పరిపూర్ణాచల బోధను చాటు మాటులు లేక చౌరముగా వినిపించ

వలెను. (కం.సం. 273)

**శిష్యుని మనోధారణ (ఆత్మావలోకనము) విధానము :**

1. నేను పెద్దలాజ్ఞను మీరే మందబుద్ధిగలవాడినా?
2. నేను సద్గురు వాక్యమును మదిలో నమ్మని చంచల బుద్ధినా?
3. నేను సత్కీర్తి మంతుడను కానా?
4. నేను బ్రహ్మాండభాండనంతములను క్షణములో ధ్వంసించితినా?
5. నేను సద్గురు మూర్తి పాదపంకరుహ ద్వయార్చన చేయలేని పాతకుడనా ?
6. నేను మలినమైన మనస్సుగల వాడినా?
7. బయలు నందు ఎఱుక లేదనిచాటగల నిర్భయత నాలో లేదా?
8. నేను గురు మంత్రసిద్ధిని పొందితినా?
9. నేను గురుని వాక్యము బట్టి గుఱుతు పోగొట్టితినా?
10. నేను పరిపూర్ణ బోధ బడసినగాని, నా చేష్టలు ఉళ్ళక్కిగా ఉన్నవా ? లేవా ?
11. నేను సద్గురుని నోటి మాట వెంబడి సంచరించు చుంటినా?
12. నేను దేహిదేహములను విచారణచేత మూలము లేనివని ధ్రువపడితినా?
13. నేను వాదభేదము లేని వాడినా?
14. నేను లక్షణయుతుడనై యుంటినా ?లేదా?
15. నేనుయెందరు ఎఱుక వారల పొందు మానితిని?

16. నేను లేనెరుకకు మూలము గలదని లేనిమాట లెంతవర కాపుచెను ?
17. నేను ఎఱుక మ్భాషుని సరిపుచ్చుకొంటినా ? లేదా ?
18. నేను పరిపూర్ణ బోధమర్మము ఎరుగుటకై తగిన క్రమ మెరిగితినా ? లేదా?
19. నేను మ్భాషయని తెలిసినా, బయలు నెరిగి తినన సరిపోవునా?
20. నేను గురుని చేత ఎఱుకను వదలిన వారిని ''కల'' వారని నానోట పలుకుట సమంజసమా ?
21. నేను గురుమంత్రమని యేటి గొద్దాలి చేత యెఱుక కూకుడు వేరుయెరిగి త్రవ్వితినా?
22. నేను పరమాత్మ స్వరూపమును కనుపాపలో వెదకితినా ?
23. నేను బ్రహ్మాండ మెరుకల భ్రమ తీసివేసితినా ?లేదా ?
24. నేను సద్గురుని పాదములపై ఆననిడినవాడనైపే నెరుకల తిరిగి చూడకుంటినా ?
25. నేను యే ప్రొద్దునను ఎఱుకను దలుచక యుండబవే గురుబోధయని యెరిగితినా ?
26. నేనుశోడశాక్షరి మహామంత్రమును (తారకమంత్రమును) మానక జపించు చుంటినా ?
27. నేను సద్గురు బోధను సుజనుల మ్రోల పలుకుటకేల వెరువవలెను?
28. నేను సద్గురు మూర్తికి యెఱుకను గురుదక్షిణగా సమర్పించితినా ?లేదా?

29. నేను ఇతర శాస్త్రముల జోలి వదిలితినా?

30. నేనుదేశికేంద్రునినోట భవనాశ స్థితులు లేని పద్ధతి వింటినా ? లేదా ?

31. నేను మంత్ర తంత్రంబుల యొక్క మర్మము గురునిచే తెలిసితినా ? లేదా ?

32. నేను మోక్షాది ఆపేక్షలను రోసితినా ? లేదా?

33. నేను సద్గురు మూర్తికి తను, మన, ధనములు ధారబోసితినా? లేదా?

34. నేను సద్గురు మూర్తికి నాలుగు శశ్రూషణములు గావించు చుంటినా?

35. నేను గురు పుత్రులను ఆదరణ యొనర్చుచుంటినా ?లేదా?

36. నేను పలుకు లేకుండు నట్లైతినా? లేదా?

శ్లో: కృత కృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయాపునః
తృప్యంస్త్వేవంస్వమనసామన్యతేసౌ నిరంతరమ్ ॥

తా: చేయవలసిన దంతయు చేసి, పొందవలసినదంతయు పొంది సంతుష్టుడైనజ్ఞాని నిరంతరముతనయందిట్లనుకొనును. (వేదాంతపంచదశి)

శ్లో: ధన్యోహం ధన్యోహంనిత్యం స్వాత్మానమంజసా వేద్మి
ధన్యోహంధన్యోహం బ్రహ్మానందో విభాతియే స్పష్టమ్ ॥

తా: ధన్యుడను . కృతార్థుడను .దేశకాలాద్య పరిచ్ఛిన్నమైన ప్రత్యగాత్మనునిరంతరము సాక్షాత్తుగా తెలిసికొనుచున్నాను.

(తత్ఫలమైన) బ్రహ్మానందము నాకు యథాతథముగ స్ఫురించుచున్నది. (వేదాంత పంచదశి)

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహందుఃఖం సాంసారికంనవీక్షేద్య
ధన్యోఽహం ధన్యోఽహంస్వస్యాఽజ్ఞానం పలాయితంక్వాపి

తా॥ ధన్యుడను. ధన్యుడను : సాంసారికదుఃఖములు నేడు నాకులేవు. నాయజ్ఞాన మెచ్చటికో పారద్రోలబడినది. (వేదాంత పంచదశి)

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యంమేన విద్యతే కించిత్
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్

తా॥ ధన్యుడను : ధన్యుడను : నాకిక కర్తవ్యమేమియు లేదు. పొందదగిన దంతయు సమకూడినది. (వేదాంతపంచదశి)

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః

తా॥ ధన్యుడను ! ధన్యుడను . ఈ లోకమున నా సంతృప్తికి సాటి యేమున్నది ! ధన్యుడను. చరితార్థుడను, మరల మరల ధన్యుడను. (వేదాంతపంచదశి)

శ్లో॥ అహో పుణ్యమహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్
అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్

తా॥ అహో ఏమి నాపుణ్యము ఎంత శాశ్వతముగ నది ఫలించినది. ఇంత పుణ్య సంపన్నులమైన మేము ఎంత భాగ్యవంతులము. (వేదాంత పంచదశి)

శ్లో॥ అహో శాస్త్రమహో శాస్త్ర మహో గురు రహో గురుః
అహో జ్ఞానమహో జ్ఞానమహో సుఖమహో సుఖం

తా॥ అహో. శాస్త్రమెంత యధ్భుతము. గురువెంతటి మహాత్ముడు.
ఈ జ్ఞాన మెంత యధ్భుతము. ఈ సుఖమెంత యనంతము.
(వేదాంత పంచదశి)

ఈ విధముగా శ్రీశ్రీధర శివరామదీక్షితాచల గురు పరం పరలో తాను గురు దీక్షను గైకొనుటం వల్ల దీక్షితనామ యుక్తుడై, పవిత్రమైన గురుభక్తి గలిగి యుండి, మంత్రానుష్ఠాన విధ మెరింగిన వాడై, బ్రహ్మత్వమునకై ఆత్మ విచారము చేయుచు, గురు పారంపర్య ధర్మ కర్మంబుల నాచరించుచు, తనకు గురు దేవుల ద్వారా సంప్రాప్తమైన ధర్మమును సద్గురు మూర్తి అనుగ్రహము, అనుమతితో సుజనుల కొరకై యొసంగుచు, తాను గురు ధ్యానయుక్తుడై నిరంతరము వాసనా రహితుడై, సంకల్ప రహితుడై, అహం రహిత పరిపూర్ణబోధ స్థితి కుదిరిన వాడై, గురు మూర్తి కరుణ చేత అశరీరుడై, అంటీ అంటని లక్షణముతో మాయజాలమున కంటనివాడై, నిత్యతృప్తుడై, బ్రహ్మానందపరుడై, నిజానంద పరుడై, అచలానంద పరుడై , బయలు నందు భావనైక్యుడై, యేబాధలు లేక, లేకయే కలిగిన తాను, లేకయే లేనట్లుగనే, యున్నను అంతట నిండిన పరిపూర్ణపర బయలు నందు అంతయై, అనంతముగనై యుండును.

# ఓం

శాంతిః శాంతిః శాంతిః

సర్వం సద్గురు చరణారవిందార్పణ మస్తు

శ్రీ దక్షిణామూర్తి పర బ్రహ్మణే నమః

శ్రీ మహా విష్ణువు ప్రభువులకు జై

శ్రీ సూర్య భగవానులకు జై

శ్రీ యాజ్ఞవల్క్య మహార్షికి జై

శ్రీ జనక మహారాజుకు జై

శ్రీ శుక మహర్షికి జై

శ్రీ సాందీప మహర్షికి జై

శ్రీ కృష్ణ భగవానులకు జై

శ్రీ అర్జున ఉద్ధవులకు జై

శ్రీ వేమన యోగికి జై

శ్రీ శ్రీధర స్వామికి జై

శ్రీ శివరామ దీక్షిత అచల గురు స్వాములకు జై

శ్రీమత్ కంబాలూరి అప్పయ్య మంత్రికీ జై

శ్రీమత్ పరశురామ సీతారామ స్వామికీ జై

శ్రీమత్ శేషమాంబ మాతాకీ జై

శ్రీమత్ భారలింగ ప్రభువులకు జై

శ్రీమత్ కృష్ణమా చార్యులకు జై

శ్రీమత్ సిద్ధాచల స్వాములకు జై

శ్రీమత్ అచలగురు అంజిలయ్య స్వామికీ జై

శ్రీమత్ నిత్యానంద కృష్ణాచల ప్రభువులకు జై

సద్గురు పీఠమునకు జై

సనాతన ధర్మమునకు జై

సర్వగురు మహారాజులకు జై

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీశ్రీశ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభువే నమః

# అద్వైతతత్వములు, భజనలు కీర్తనలు తత్వములు


కృతికర్త :-

అ ప నిజానంద తులసీదాసు (పెన్షనరు)

సవరణ కర్త :

నిర్మలానంద కాడిగె నారాయణ హైద్రాబాదు

# ఓం
# శ్రీగురుభ్యోనమః
## ❁ విజ్ఞప్తి ❁

శ్రీ మహాయోగిని శేషమాంబగారి పరంపరాచార్యులలో నొకరగు శ్రీ కస్బా సిద్ధాచల స్వామి సర్జభాన్ పేట వారు ముఖ్యులు. వీరి శిష్యులు అ.ప. నిత్యానంద కృష్ణాచల ప్రభువుల వారు. వీరి శిష్య రత్నంబగు అ.ప. నిజానంద తులసీదాసు. వీరు 1969 లో వ్రాసిన **"అచల తత్వము"** అను చిన్న పుస్తకము ముద్రణ గావించు కోరిక గలిగి, తప్పులున్న సవరించి ముద్రణ కనుగుణ్యముగా నుండునట్లు సరిచేయవలసినదిగా నన్ను కోరిరి. వారి కోరిక మేరకు గ్రంథము అసాంతము చదివి నాకు తోచినంత స్థాలీపులక న్యాయముగా సరిచేయ గల్గితిని. ఇందులో ఏవైనా గుణదోషము లుండిన యుండవచ్చును. చదువరులు ఇందలి సారాంశమును గ్రహించి, సవరించి, చదువ గోరెదను. పాఠకమహాశయులు మన వారే కావున తదనుగుణ్యముగా చేయగలరని మనవి.

ఇందు భక్తి జ్ఞాన వైరాగ్యములు, గురుభక్తి, విశేషముగా వ్రాయబడినది. గురుపూజ సమయమందు మనము పత్రపూజలో తులసీ దళములు సమర్పించెదము. అదే విధముగా ఈ చిన్నపుస్తకమును గ్రంథకర్త గురుభక్తి పూర్వకముగా సద్గురు మూర్తి పాద పద్మముల కర్పించి జన్మ చరితార్థము గావించు కొనెను. కావున పాఠక మహాశయులెల్లరు ఇందలి భజనలు, కీర్తనలు, తత్వములను తులసీ దళములుగా ఆదరించి, చదివి, ఆనందించి, ఆనందింప జేయగలరని మనవి.

మరియు గ్రంథకర్త యగు అ.ప. నిజానంద తులసీదాసుకు, గ్రంథ

ముద్రణకు ప్రోత్సహించి, పరోక్షముగా, ప్రత్యక్షముగా సహకరించిన సాంప్రదాయ గురు బంధువులెల్లరకు, సర్వాంగ సుందరముగా ముద్రణ గావించి, సకాలమున కందించిన శ్రీ ఉదయ్ ప్రింటర్స్, (నారాయణగూడ హైదరాబాదు) ముద్రణాలయము వారికి సద్గురు మూర్తి కృపా కటాక్షముల ప్రసాదించి, సకల శుభములు కలుగజేయు గాక యని కోరుచున్నాను.

ఇట్లు
అ॥ ప॥ నిర్మలానంద కాడిగె నారాయణ
13-4-757/1బి, కారువాన్
హైదరాబాదు - 500067. (ఆం.ప్ర)

(శ్రీమత్ పీల్ఖాన లక్ష్మణ ప్రభు అచలగురు మందిరము (సీతాఫల్‌మండి) మాజీ ప్రధాన కార్యదర్శి)

ఓం

# మహాగణపతి స్తుతి

రాగం -కళ్యాణి

1. తాళం - ఆది

గణరాజా మిము - వినుతించెదమురా
కనికరముంచియు - కరుణచె బ్రోవర ప

1. పరమేశ్వర సుత - పరహిత కారణ
వరదాయక శ్రీ - వత్సల యని నిను గ

2. ఆదిదేవుడవు - మోదకరూపుడ
ఆదరింపుమము - నీదరి నుంటిమి ॥ గ ॥

3. విఘ్నంబులను - భగ్నము జేయర
విఘ్నేశ్వర - ఓ - విఘ్న వినాయక ॥ గ ॥

4. అడిగ పూజలు-అందుమనుంటిని
పొంగుగ మున్ముల - నీదరి జేర్చర ॥ గ ॥

5. వేడితి వేడితి -వేసారితి మరి
వీడితి వీడితి - విషయంబులనుర గ

6. మూషక వాహన - పోషకు నీవని
కోషవే వేడితి - దేశిక బ్రోవర గ

7. వేలుపు లందరి - వేలుపు నీవెర
అల్పుడు తులసిని - నిలుపుము నీయెద గ

రాగం : తిలకామోద్

తాళం : ఏక

2. దండాము శ్రీగురు కృష్ణా - మాకు
అండాగ నుండుము కృష్ణా కృష్ణా ప
1. బయలూ స్వరూపుడ కృష్ణా కృష్ణా - నిన్ను
భావంబు దలతును కృష్ణా కృష్ణా దం
2. నిండార దయతో కృష్ణా కృష్ణా-బోధ
మెండూగ జేయుము కృష్ణాకృష్ణా దం
3. బ్రహ్మాండ నాయక కృష్ణా కృష్ణా- మాదు
భ్రమలన్ని దొలగించు కృష్ణా కృష్ణా దం
4. దాసావరద -శ్రీ- కృష్ణా కృష్ణా - నాదు
ధ్యాస నీపై నుండె కృష్ణా కృష్ణా దం
5. అభయహస్తము వాడ కృష్ణా కృష్ణా - మా
కభయమొసంగుము కృష్ణా కృష్ణా దం
6. కొమ్మూరు పురవాస కృష్ణా కృష్ణా - మిమ్ము
ముమ్మారు వేడేము కృష్ణా కృష్ణా దం
7. కలిసున్న మీలోన కృష్ణా కృష్ణా- ఈ
తులసీని బ్రోవుము కృష్ణా కృష్ణా దం

రాగం - మోహన

తాళం - ఆది

5. నినునే గంటినయా - శ్రీగురుదేవా
నినునే గంటినయా ॥ని॥

1. నినునే గంటిర - నిత్యము నీవని
నిత్యమునీవని -సత్యమునీవని ॥ని॥

2. ఎఱుకను వీడితయా -నిను గన్న ది - తడవే
మరుపును వీడితయా
ఎఱుకను వీడితి -ఎందు లేదని తెలిసి
నరక రూపంబంత -నరిగినతడవే ॥ని॥

3. స్థిరమును నీవేగా -శ్రీగురుదేవా
పరమును నీవేగా
స్థిరమ స్థిరముల- స్థిరమును నీవని
కరములు ముకుళించి -శరణని వేతిడి ॥ని॥

రాగం : అసావేరి

తాళం : ఆది

4. ఘల్లు ఘల్లున - రారమురహరి
యుల్లమును -రంజిల్లగా

1. యుల్లమును - రంజిల్లగా మరి
వెల్లరను - కడ తేర్చగా ॥ఘ॥

2. కల్ల జగమున - సొమ్మసిల్లితి
చల్లగను మము - బ్రోవరా ఘ
3. దారి దెలియక - వేరు పడితిని
కరుణ జూపియు - గావరా ఘ
4. మాధవా నిను - మానసంబున
శ్రీధనంబుగ - నిలిపెదా ఘ
5. అఖిల మంతయు - నావరించిన
ప్రకటరూపుడ - పాహిమాం ఘ
6. దోషు మెంచకు - దాసవరదా
ఆశ బెంచితి - బ్రోవరా ఘ
7. సర్వమంగళ - రూపనిన్ను
నిర్విరామము - గొలిచెదా ఘ
8. మొరను విని శ్రీ - తులసిదాసుని
పరమ పదమున - నిలుపరా ఘ

రాగం - శంకరాభరణం
తాళం - ఆది

5.

అందంబుగ నీ - పాదంబులకునే
వందన మందునె - ఓ మనసా ప
సుందరముగ నీ - సూక్ష్మపు తనువును
పొందగ జేయవే - ఓ మనసా అం

2. ఎన్నియొ జన్మల - పుణ్య ఫలంబున
ఏగితి గురుకడ - కోమనసా
వన్నెలు ఐదిటి -మీరిన పదవిని
ఎరుగగ జేయవె -ఓమనసా అం

3. గోప్యంబగు గురు -జ్ఞానంబును మది
గూఢము గుంచితి - నో మనసా
ప్రాప్యంబుగ నా- కొచ్చినకర్మల
పారగ దోలవే- ఓమనసా అం

4. అంతటు లేవని - సంతతమెరిగితి
పంతము జేయకె -ఓమనసా
స్వాంతమునందున - శ్రీగురుపదముల
సొంతముజేయవే - ఓ మనసా అం

5. తెలిసియు తెలియక -తెగనాడితి నిను
తాలిమిదాల్చవె -ఓ మనసా
వలచితిననినను-చులకనజూడక
నిలుపవే స్థిరమున - ఓమనసా అం

6. ముందు వెనుక మరి- మూలము లేకనె
ముఖ్యము గుంటివే -ఓమనసా
రండలోజిక్కితి - రయమున వేడెద
సంధిని దెలుపవే - ఓ మనసా అం

7. మేలగు బోధలో - చాలగనుంటిని
గోలనుజేయకే - ఓమనుసా.
చాలని నినుమద -తూలగ నెంచితి
జాలము ల్లలకె - ఓ మనుసా అం

8. బాలుడ నైతిని- లీలలుజూపకె
తాలక నుంటినె - ఓ మనుసా
చాలిక నీ సంగతి-నా కెన్నడు
యిల కృష్ణులో - గలుపవె ఓ మనుసా అం

తాళం : ఆది

5. రాగం : దుర్గా

శ్రీకర భవహరణా - శ్రీగురువే
ప్రాకటముగ నను- పాలన జేయుము ప

1. పారము లేని -సం-సార బంధమును
దూరము జేయుమురా - శ్రీగురువే శ్రీ

2. విషయ పంచమును - వీడగజేయగ
విభుడవు నీవె గదా -శ్రీ గురువే శ్రీ

3. నిను మది దలచిన -వారెల్లరనూ
క్షణములో బ్రోవుమయా - శ్రీగురువే శ్రీ

4. పలు విధముల నిను - ప్రస్తుతి జేసెడి
తులసిని గావుమయా -శ్రీ గురువే శ్రీ

# నామము

భావములో - భగవంతుని - వేడుము ప

భవమంతయు - బాపును-వేగమురా భా

దేవ దేవునీ - నీమది - నమ్మర

ఆవలి వాడవే-అగుదువు -నిజముగ భా

రాగం:అసావేరి

7.

తాళం : ఆది

యేడనున్నావో - రార నా ప్రభు

జాడ దెలుపర -జోడు గూడెద ప

1. యెంతయో వెదకితి -సంతసమొందుచు

మంతనమున-నీ-మర్మము దెలియక యే

2. అణువణువుననే - నణువై వెదకితి

కను మరుగున నీవు - కానక యుంటివి యే

3. చలమంతయు విడి - 'అల' - 'నిల' వెదకితి

కల రూపముగను - వెల వెల యుంటిని యే

4. యెందరో యనిరి నీ -వంతట గలవని

మందమతిని నేను - అంధుడనైతిని యే

5. వింతల వింతల -వీధుల దిరిగితి

యెంతయో అలసితి - సంతసమొందక యే

5. గురువుల వేడితి - శిష్యుల గూడితి
గుణములు గుదురక - గుణుగుచు నుంటిని యే
7. ధరణి కొమ్మూరు - గురువర వేడెద
సరుగున నాకును - మరుగిక దెలుపుము యే
8. బెన్నూరు వాసుడు - యిల తులసి దాసుడు
కల జగమంతయు - కన్నుల ముంచెను యే !

రాగం: శ్యామకళ్యాణి
8.
తాళం : చాపు

అది లేదా - యిది లేదా ! అదియిది యనేటి మది లేదా

| ప |

1. వదిలేదా - పట్టేదా నే
కదిలే దానిని - చుట్టేదా !! అ !!
2. ఉందనగా - లేదననా యే
సందున లేకా - నేజననా | అ !!
3. రమ్మననా -పొమ్మననా నే
రమ్యముగాను - రయమవనా అ
4. అది యిదియా - యిది అదియా అనే
మదిలో శంకను -వదులుదునా అ.
5. నీవననా - నేనననా నీనా
భేదము - లేదననా అ

5. రూపంబా - అరూపంబా అనే
ప్రాపవు రూపును -మాపుదునా అ

7. తలచుదునా -కొలచుదునా యీ
వలపుల - తీపిని - నిలుపుదు నా అ

8. భావననా - నను గావనగా మరి
నీవలె నను దీ - వించననా అ

రాగం: భూపాలం

9. తాళం : ఆది

సోహం బనరా - సోహంబనరా
ఆహం భావం - బంతయు విడరా ప

1. కోహం కస్త్వం - కూరిమి దెలిసియు
దేహాపు వాసన - ధీమతి విడరా సో

2. విద్యా లవిద్యల - వినయము దెలిసియు
సజ్జన సంగతి - సరుగున గనరా సో

3. స్థూలము మొదలుగ - కారణమంతయు
మీరిన దానిని- ముదమున గనరా సో

4. అవతలి యివతలి - ఆటను దెలసియు
నడి మార్గమునన్ - కూటమి జేయర సో

5. లోబయలంచును- వెలిబయలంచును
భేదము బెట్టక - బయలులో బయలవు సో

6. సృష్టి స్థితిలయ - చింతను జేయుచు
వ్యష్టి సమిష్టిల- వ్యాథ -నీ వొందకు ; సో
7. పలు పలు విధముల - చలనము నొందకు
పలుచన యగునీ-భావముమదిలో ; సో
8. హంస గమనుడని -తులసీదాసు గను
సంశయ చ్ఛేదకు -కృష్ణ ప్రభుని గొను సో

రాగం: దర్బార్కానడ
10.
తాళం : ఆది

మాధవా - మధు సూధనా
మాధవా - మధు సూధనా ప
నీ నామంబే - బహురమ్యముగా
నానునమంతయు - నీదవగా మా
2. తాపసు లందరి - తపము ఫలించగ
గోపకులంబున - వెలసితి వేరా మా
3. దనుజుల దునుమను -ధర్మము నిలుపను
జను రూపంబున - జన్మించితివీ మా
4. వెన్నల దొంగని - పన్నుగ దెలిసెను
వెన్నను బోలు- నా- మనసు హరించుము మా
5. కన్నయ్యాసిను -యెన్నగ తరమే
మన్నన జేయుము - తిన్నని తులసిని మా

రాగం: దుర్గా(శ్యామ)

తాళం : ఆది

శ్రీగురు చరణములూ - భజించర (ప)

1. ఈ కల జగములో - ఈమల ఘటములో
ఏల నీకిక భ్రాంతీ -ఓ నరుడా (శ్రీ)

2. ఎనుబద నాల్గు - లాక్షల యోనుల బడి
నిను మరచితివి గదా-ఓ నరుడా (శ్రీ)

3. మాయ సంసారమున -మసల లేకను నీవు
మోసము పాలైతివీ -ఓ నరుడా (శ్రీ)

4. నీ నిజ రూపంబు -నిక్కముగ దెలియదు
నిను నీవు - దెలుసుకోరా -ఓ నరుడా (శ్రీ)

5. ఇంద్ర జాలము వంటి -ఈ జగమందున
ఘన సాంద్రునీ వెదుకూ -ఓ నరుడా (శ్రీ)

6. జనన మరణంబులనే -భవరోగమును బాపు
సవిమల గురునీ వేడరా -ఓనరుడా (శ్రీ)

7. ఎన్నో జన్మల కొద్దీ - పుణ్య ఫలంబున
కన్న గురువులాజేరుముురా - ఓ నరుడా (శ్రీ)

8. ఉన్న దేవుని జూడ - ఉత్సాహం గలవాడ
మేల్కొన్నాలనూ గోరుమురా - ఓనరుడా (శ్రీ)

9. కాల కూటము కన్నా -కడుసిన్న విషమైన
మాయ సంగతి మానుమురా -ఓనరుడా (శ్రీ)

10. వాద భేదము లేనీ - వరదూనీజతగూడి
బాధలన్నియు బాయుమురా - ఓనరుడా శ్రీ
11. వేష భాషలు మాని - మోస గుణములుమాని
ఆస బెంచూము గురునీపై - ఓనరుడా శ్రీ
12. ఆశ పాశంబులనే - కోశ బంధములాను
నాశనంబును జేయుమురా - ఓనరుడా శ్రీ
13. దాస దాసుల బ్రోచు - వా సుదేవు-ని బోలు
దేశికూ గూడరా - ఓ నరుడా శ్రీ
14. దాస మార్గము నందు - దోషము లేక నడచు
తులసీ దాసునీ - గూడరా - ఓనరుడా శ్రీ

రాగం: షణ్ముఖప్రియ

12.

తాళం : ఆది

ఏమని పొగడుదురా - శ్రీ గురుదేవ
ఎంతని పొగడుదురా ప
1. అండము నందున - పిండము నందున
బ్రహ్మాండంబున - భలెనిండితివిర ఏ
2. నామనమందున - నేమముదప్పక
కామనలన్నొదలి - ధాముడవేడితి ఏ
3. భక్తుల నందరి - రక్తులనందరి
ముక్తుల జేసెడి - భక్తవరదనిను ఏ

4. అల సనకాదులు - తలచగ బ్రోచితి
విల తులసిని గావ - అలుక నీకేలర ఏ

రాగం: సీలాంబరీ
13. తాళం : ఆది (తితాల్)

సారస దళ నయనా - మురారీ
నేరము జేసితి - భారము నీదేర ప

1. ఇడుముల నన్నిటి - వరముగ దలచితి
వడిగను బ్రోవర - వరదాయక శ్రీ సా

2. పాదము మరచితి -వాదములో బడి
భేదము బెట్టక -నీదయ జూపుము సా

3. యతి వరదా నిను - అతి నుతియించెద
పతివని వేడెద - గతి నీవేయని సా

4. వేల్పుల యందరి - వేడుక నీవేరా
అల్పుడు తులసిని - వీడక జూడర సా

రాగం: ఓంక్సాస్
14. తాళం : తితాల్

పావనాంగ పర - బ్రహ్మవు నీవే
కావగాను మము - విష్ణుడ వీవే ప

1. హరహర శంభో - మహాదేవ నీవే
సుర నర వరులను - బ్రోచెద వీవె పా

2. అణువణువున జూడ - అంతయు నీవే
నను బ్రోచెటి దేవా - పురహర నీవే సా

3. భక్త వరదమము - బ్రోవను నీవే
శక్తి యుక్తులు మాకు-వొసగను నీవే సా

4. అల బ్రహ్మాదుల - కాద్యుడ వీవే
ఇల తులసిని బ్రోవ - ఈశ్వరుడీవే సా

రాగం: చారుకేశి

15. తాళం : ఆది

ఏదిశ చూచిన - మాధవ నీవేర
ఏదిర నీకన్న - ఈ -ధర యందున ప

1. రాముడ వైతివి -రమణుడవైతివి
రమ్యుడవైతివి -రామా హరిహరి ఏ

2. నిత్యుడవైతివి -సత్యుడవైతివి
కృత్యుడవైతివి - రామా హరిహరి ఏ

3. దశ రూపంబుల- వశమున దాల్చిన
దశ కంఠవైరీ - రామాహరిహరి ఏ

4. దశరథ తనయుడ - జానకి రమణుడ
దశ రథపాలక - రామా హరిహరి ఏ

రాగం: దర్బార్ కానడ

15. తాళం : ఆది

శివశివ శంభో -హరహర శంభో
మహదేవా -శివ-మహదేవా ప

1. హర ఓం శివఓం - హరహరశివఓం
మహదేవా -శివ - మహదేవా శివ

2. పాతక హరశివ - శ్రీపతి గురువర
మహదేవా-శివ-మహదేవా శివ

3. సుందర రూపుడ - సురవర వినుతుడ
మహదేవా- శివ - మహదేవా శివ

4. నీల కంఠ శివ - ఫాల నేత్ర శివ
మహదేవా - శివ -మహదేవా శివ

5. ప్రణవ రూప శివ - అణువులోని
మహదేవా - శివ-మహదేవా శివ

6. తులసి దాస స్థవ -హర శంకర భవ
మహదేవా - శివ -మహదేవా శివ

రాగం: సారంగ

17. తాళం : ఆది

చాలగ వేడితిరా -శ్రీగురువర (2)

జాలములన్నియు -లీలగ బాపుము ప

1. మాయకు లోబడి-మసలెడి నన్ను
బాయక బ్రోచెడి - పరమ గురుడవని చా

2. మోదము తోడుత - నీదయ జూపుచు
సాదరముగ నన్ను - నీ దరి జేర్చగ చా

3. ఫాలవు వరదనీ - లీలలు దెలియగ
కాలవు పడవనే - మేలని నమ్మితి చా

4. కోరిన తడవున - కూరిమిచే బ్రోచె
సారస దళనేత్ర - సరగున బ్రోవగ చా

5. రే-పవలందున -నినుమది నమ్మియు
శ్రీపదమావలి - స్థిరమని నమ్మితి చా

రాగం: మోహనకళ్యాణి
తాళం : ఆది

18.

రార శ్రీగురు వర- రారశ్రీగురువర.
రారా రారా-రావేరా ప

1. పరమ పావన నను - స్థిరునిగజేయుము
మరి మరివేడెద -వరదాయా రా

2. నీపై ప్రేమచే - 'నితరుల' వీడితి
జూపుము నాపై- కృపనీవ్రా రా

3. పదములు నమ్మితి - వదన మనోహర
కుదురుగ జేయుము - పదలము నెపుడు రా

4. 'మాయ' ను సర్పము - మముగాచున్నద
ఓయని బిలచిన - వానరగరమ్మర . రా

5. ఎంతని వేడుదు - పంతము మానర
సంతస మొందగ - సరి తెలిపీయర రా

6. చింతలు జేసితి -సంతకు లోనై
వింతల మదినీ - క్రాంతము జేతును రా

7. తలచితి తలచితి -నిలిచితి నిలచితి
వలచిన నను నీవు - పలుచన జేయకు రా

8. సతి సుతులందరు - సరివరముండగ
వెతలు తులసిమది - పతనము జేయుము రా

రాగం: మోహన
తాళం : ఆది

## 99.

గురు రాయా - మద్గురు రాయా - మీము
శరణని వేడితి ప్రభురాయా ప

1. నీవేగా మము - కావగా - గురు
రావేరామరి వేవేగా గురు

2. దాసోహం-మముః దాసోహం - నీ
దాసుడ నీపద దాసోహం గురు

3. మరువనురా - నిను - మరువనురా నే
ఎఱుకను విడగను వెదువనురా ॥ గురు ॥

4. మధురమురా - అతి మధురమురా నీ
పదముల నందిన మధురమురా ॥ గురు ॥

5. నాపతి క్రిష్ణని - నిను వేడే రా
ధాపతి తులసిని రక్షించూ ॥ గురు ॥

రాగం: నీలాంబరీ
తాళం : ఆది

20.

1. హరి నిను మరువనురా - నామదిలో ॥ ప ॥
హరి నిను మరువక - నిరతము గొలిచెద
హరి హరి హరి హరి - హరిహరి యనుచును
॥ హ ॥

2. దొరవని వేడుదురా -శ్రీపతి నిను
దొరవని వేడితి -దరిజేర్చెదవని
మొరవిని బ్రోవర - కరినేలిన హరి ॥ హ ॥

3. నామము మరువనురా - శ్రీహరి నీదు
నామముదలతును - నీమము వదలక
ధాముడ బ్రోవుము - దలతును కదలక ॥ హ ॥

4. తులసిని గావుమురా-శ్రీహరి గురు
తులసినిగావుము - తలచిన తడవే
కొలచిన వారల- కభయము నిడవే ॥ హ ॥

రాగం: తిలంగ్
తాళం : ఆట

2.

పరాత్పరాశంకరా హరా - నా - మొరాలకించుము
హరా హరా ప

1. హరా హరా శంకరా హరా - మము
బిరాన బ్రోవుము హరా హరా పరా

2. కరీ వరద గురు హరాహరా - సరి
వరాల నివ్వరహరా హరా పరా

3. నంది వాహనా హరా హరా - నిను
నందెద మనమున హరా హరా హరా

4. నాగ భూషణా హరా హరా - నను
వేగమె గావుము హరాహరా హరా

5. గణపతి కాద్యుడ - హరాహరా - నిను
ప్రణుతిసే జేసెద హరాహరా హరా

5. దాసుడు తులసిని హరాహరా - దయ
జేసియు బ్రోవుము హరాహరా హరా

రాగం: మోహన

తాళం : ఆది

22.

శ్రీగురుదేలెంచెగా స్థిరముగా - పరమ పదంబిచ్చెగా ప

బాలుని రీతిగ - బేలగ నున్నా

లీలగ మము బ్రోచే .......ఏఏఏ (2) శ్రీ

1. రాకడ పోకడ - రహస్యము దెలిపీ

ప్రకటితముగ - మాదు మూలము బాపీ

నిజమున నిలజేసెనూ ..... ఊఊఊ (2) శ్రీ

2. పంచాక్షరముల - ప్రాపును దెలిపీ

పాయుచుండెడి - హంసను లేపీ

నష్టకముజేసెగా .... ఆఆఆ .... (2) శ్రీ

3. ఐదు ఐదులా - తత్వములణచీ

అందరి మూలము - నీవనిదెలిపీ

నీ వుండవని - తెలిపెనూ .... ఊఊఊ (2) శ్రీ

4. ఉన్నది ఉన్నట్లు - వుండగ జూపీ

లేనిది లేనట్లు - లీలగదెలిపీ

ఉన్నది నమ్మనెనూ .... ఊఊఊ (2) శ్రీ

5. ధరణి కొమ్మూరు - పురమున వెలసీ
పరమున కావలి - తులసిని బ్రోచీ
పర బయలును జూపెనూ ..... ఊఊఊ (2) శ్రీ

రాగం: కానడ
తాళం : రూపక

23.

కరుణించి - దేవదేవుడు - వరమిచ్చి బ్రోచురా ప

1. నిరతంబు - మదిలో - నీవును
గురువరుని - వేడినా కరు

2. రాగ భావమంతయు - రమ్యముగ బాసినా
భోగ లాససత్వమును - వీగ జేసినా కరు

3. ధర్మ నిరతియంతయు - సర్వంబు నిలిపినా
మర్మమంత మరువక -కర్మంబు జేసినా కరు

4. ప్రశ్న లేమి వేయక - శ్రీకృష్ణు వేడినా
తృష్ణలన్ని బాసిన -శ్రీ తులసి గూడినా కరు

రాగం: భైరవీ
తాళం : ఆది

24.

భ్రమణము జెందకురా- జీవా- భ్రమణము జెందకురా
భ్రమణము జెందితె -దుర్గతిగలుగును
వమనము జేసిన - వాంఛలు నీకేల

1. ఉన్నది మరువకురా -జీవా - కన్నది బాయకురా
అన్నది విన్నది - కన్నది మానుము
యెన్నగనీవె ప్ప - యెప్పను 'కల' యౌను ॥భ॥
2. ధర్మము తప్పకురా- జీవా - మర్మము బాయకురా
ధర్మ మర్మముల - సరణిగుర్తెరిగియు
పరమూలో - పరమొందరా జీవా ॥భ॥
3. సేవలు జేయుమురా - జీవా- గురు భావములో నుండరా
సావ భావంబుల -భావముదెలిసియు
ఆవలిదరి నుండరా - జీవా ॥భ॥
4. సుజనులకూడుమురా - జీవా -కుజనులనీడుమురా
కుజన సుజనముల -కూటమి మానియు
నిజమున నిలిచుంతడరా జీవా ॥భ॥
5. దేశికు శరణొందరా- జీవా-దాసుల దరిజేర్చరా
దాస దాసుడు తులసీ - దాసుని జతగూడి
పాశంబులనూ - దునుమరా -జీవా ॥భ॥

రాగం: మాయామాలవ గౌ

తాళం : ఆ

## 25.

హరి హరి యనరా - శివశివ యనరా
హరి బ్రహ్మాదుల - గుఱిగనరా ॥ప॥

1. గుఱి గనరా -మది - గుఱి గనరా
గురు పరమాత్ముడే - సరియనరా హరి

2. సరిసరి యనరా - నరహరి యనరా
'ధర' యందున - 'పం-డరి' పురి జనరా హరి

3. ముగ్గురు మూర్తుల -మూలము గనరా
దగ్గున మేల్కొని-దివి జనరా హరి

4. రమ్యమురా -భలె-రమ్యమురా గురు
నెమ్మది -నమ్మిన -ధన్యమురా హరి

5. మౌనరా- మది- మౌననరా నీవు
మౌనము గానే - మరిజనరా హరి

6. లేదనకూ అది - పోదనకూ యిది
శ్రీధరు బోధను - వలదనకూ హరి

7. లేదనకూ గుఱి - లేదనకూ హరి
సాధన వేడిన - సన్నిధినే హరి హరి

8. నిలుతనకూ నీవూ తలుతనకూ నీవు
తులసిదాసుని -తోడు - విడుతనకూ హరి

రాగం: మాల్‌కౌస్
తాళం : త్రితాల్

26.

నీవేరా నిజమూ - శ్రీగురుదేవా

నీవేరా నిజమూ ప

1. నీవే నిజమురా - నిఖిలమునందున
నీవే సర్వము - నిజముగ నిజమురా నీ

2. ఇహమున నీవే - పరమున నీవే
అహమున కావలి - సహజము నీవే నీ

3. తనువున నీవే - అణువున నీవే
కను మరుగును-లేక -కలిగిన దీవే నీ

4. రాముడ వీవే- రమణుడవీవే
ధాముడ వీవే -'ధరణి' 'పురేశా' నీ

5. వేదమునందున - బోధము నందున
ఈధరయందున -శ్రీధర నీవే నీ

6. నామము నందున - నీమము నందున
పామరులందున - పరముల యందున నీ

7. తులసి మనంబున - నిలచిన దీవే
తలచిన వారల - బ్రోవను నీవే నీ

రాగం: కళ్యాణి
తాళం : ఆది

27.

రారారారా - రారారారా
రారారారా - రార రఘువర ప

1. కోరిన కోర్కెలు - తీర్చెటి వాడా
కోమల దూపుడ -రావేలా రా

2. ధారుణి ధర్మము - దశవిధమాయెను
కూరిమి తోడుత -కూడగ జేయగ రా

3. నీవున్నది మది -నిశ్చయమాయెను
నేనన్నదెయిక - అంతరమాయెను రా

4. తత్వంబుల మది - తరచగ నైతిని
సత్వమనంబును - సమరసముంచగ రా

5. యెందరోయెన్నియొ - అన్నను గానీ
వందన మిడితిని - అందర శరణని రా

6. కన్నులు కాయలు - కాయగవేచితి
మన్నన జేసియు-మము బ్రోవగను రా

7. ధర్మము మర్మము - ధారుణి దప్పెను
నిర్మల హృదయా - మముగావగనూ రా

8. శ్యామల దూపుడ - ఇడుముల బాపర
కోమల హృద యా - కూనకు నివ్వగ రా

రాగం: మోహన

తాళం : ఆది

28.

కావగ రావేలరా -శ్రీగురు వర (2) ప

1. కావగ రావేల - భావము నందున
నీవని నమ్మితి -నిజముగ బ్రోవర — కా
2. నారాయణ యని - నా మనసందున
పారాయణ -జే-యుదు-నీనామం — కా
3. అంతయు నిండిన - అగణిత నినునే
మంతన మందున -మరిమరి వేడితి — కా
4. మాయలో జిక్కియు-పాయగనైతిని
దోయుము మనమును- నాయన నీవును — కా
5. తలచి తలచి నిను -తులసియు అలసెను
పలుచన దలచియు - అలుకను జెందకు — కా

రాగం: శివరంజని
తాళం : ఆది

29.

మనసా .........గురుని భజించవదేలా — ప
1. చాలగ శ్రమలను - పాలుగ జేసుక
కాలుని గూడకుమూ - మనసా — మ
2. పదునాలుగు సరి - పురములు నిండిన
ఆదిదేవు గనుమూ -మనుసా — మ
3. ఇరువది అయిదూ - 'యిరుకు' తత్వముల
వెదువక దునుమవలే - మనసా — మ

4. సర్వ తనువులకు - అన్నపై - తినని
వంచన పొలవకూ - మనసా ... మ

5. ముప్పది మూడూ -కోట్ల దేవతలు
ఒప్పుగ నేననకూ -మనసా ... మ

6. పంచ పంచముల- ధ్వంచిన తడవే
గాంచుము శ్రీ గురునీ-మనసా ... మ

7. సర్వ అంగముల-లింగము నేనని
భంగము పొలవకూ - మనసా ... మ

8. నీజన్మమునకు - కారణమేమిటో
నిజముగదెలియవలే - మనసా ... మ

9. అఖిలము నాదని - సకలము నేనని
వికలము జెందకుమా -మనసా ... మ

10. అణువణువునసే -నావహింతునని
గుణుగుచు గూలకుమూ -మనసా ... మ

11. తృష్ణల నెల్లను - త్రుటిలో బాపెడి
కృష్ణగురునీ వేడుమూ - మనసా ... మ

12. అలువక సొలువక - గురునుతి జేసెడి
తులసీ దాసుని గూడుమూ - మనసా ... మ

రాగం: శంకరాభరణం

తాళం : ఆది

30.

1. శ్రీగురు పదముల మదిలో నెప్పుడు-
చింతన జేయును సరికాడు
ఏగురు నమ్మిన ఏమి ఫలంబని
యెదురు బల్కును ఎఱుకోడు ॥ శ్రీ ॥

2. వాద భేదములు జేయక నెప్పుడు -
మోదముగుండును సరికాడు
మీదమీద బడివాదము జేయుచు
భేదము బెట్టును ఎఱుకోడు ॥ శ్రీ ॥

3. గురు మంత్రంబునుగుజిలో నిలిపి -
గుణముగనుండును సరికాడు
పరమ పదంబును జేరు మార్గము -
యెఱుగక జెడును ఎఱుకోడు ॥ శ్రీ ॥

4. తత్వమూలమును తరచిచూచియు -
తరించియుండునుసరికాడు
సత్వగుణంబుల సంగతిలేక -
తరించ లేడుఎఱుకోడు ॥ శ్రీ ॥

5. నిజగురు ధర్మము నీతినిదప్పక -
నియతిని కలుగును సరికాడు
అజ రుద్రాదులకలవిగాని పర -
మొందగ లేడు ఎఱుకోడు శ్రీ

5. నాలుగు వాక్యంబుల సారంబును -
నయముగ విడుచును సరికాడు
పొలుగ అప్పిట నేనె యుందునని
నీలుగు చుండును ఎఱుకోడు శ్రీ

7. ధర్మము దప్పక మర్మము మరువక -
కర్మము జేయును సరికాడు
సర్వమునందున సొగిల బడి తా -
సావక యుండును ఎఱుకోడు శ్రీ

8. ఎఱుక మఱుపులను ఎఱిగి నిరతము
ఏకము గుండును సరికాడు
నరక కూపమున నలుగటు కొరకె
ఎఱుకై యుండును ఎఱుకోడు శ్రీ

9. భవ బంధముల బాధను దునియే -
బోధను బొందును సరికాడు
శోధన జేయక వాదములో బడి -
పాదము మరచును ఎఱుకోడు శ్రీ

1?. చావు పుట్టులను సమయజేయు -
శ్రీ కృష్ణుని వేదును సరికాడు
కావు కావుమని యరచుకాకివలె -
కూయుచు నుండును ఎఱుకోడు శ్రీ

1?. తులసి దాసునీ హృదయ పద్మమున -
తూరియు చూచును సరికాడు
తోలు దేహమున మోహము విడకా -
కాలము నొందును ఎఱుకోడు శ్రీ

## కీర్తనలు

రాగం: సామ

తాళం : ఆది

3?.

1. నిర్వికార నిరంజన రూపా - గురవే - సద్గురవే
సర్వ మందున సరిగనిండిన - గురవే - సద్గురవే

2. బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపా - గురవే - సద్గురవే
బ్రం-హ్మాండ - భాండము - అంతనీవే - గురవే - సద్గురవే

3. ఇహము పరముల ఇడుముల బాపే - గురవే - సద్గురవే
ఆహము నంతయు అణగజేసిన - గురవే - సద్గురవే

4. ఏకమనేకము భేదము దెలియని - గురవే - సద్గురవే
శ్రీకరాంతపు పదవి నొసగిన-గురవే - సద్గురవే

5. పరగ బయలును - స్థిరముగ నీవే-గురవే-సద్గురవే
కరుణ జూడుము పరుడు తులసిని -గురవే -సద్గురవే

రాగం: ఆసావేరి

తాళం : ఆది

32.

అందని - పదవని - సందేహ మెందుకు
ముందర నున్నాడ - ముదమున గనర — ప

1. యెందరెన్నన్నను - అందరి కన్నుపై
సుందరముగ పూర్ణ - చందురునీ బోలు — అం

2. ఎఱుక మఱుపులను -యెడమేమియు లేక
వర సద్గురువరు - తిరముగ నుండగ — అం

3. తత్వ సమితి యగు -యెఱుకను విడచిన
"తత్వమస" నే పలుకే -తరగాను గురునిలో — అం

4. కను మూసి తెరచిన -'కణిక' భేదము లేక
'కను' వార లందరి-కనువయ్యి యున్నదీ — అం

5. రాక పోకలు లేక - యేకమై నిలుచున్న
శ్రీ కరు కరుణచే- నీకైన తెలియుర — అం

6. ధరణి కొమ్మూరు - పురమున వెలసియు
పరగురు కృష్ణుడు - మన - సరసన యుండ — అం

7. బెన్నూరు పురవాసు - డిల తులసి దాసుడు
కన్నారు యనినీవు - కలత జెందాగ బోకు .. అం

రాగం: సామ
తాళం : ఆట

33.

కృప గలిగే దెన్నాడో - దేవా మా
చిత్తాము - బాపాగ రావా ప

1. మీ పాద - జలము గ్రోలితినీ దేవా
పాపాలన్నియు - పోదోలితివీ కృ
2. మీ వచనంబుల - మనసున వింటీ దేవా
భావా మందున - దాచూకుంటీ కృ
3. తత్వంబులలో - తగ - దిరిగితినీ దేవా
యేమీ లేకనే - యెరిగరిగితినీ కృ
4. మేలైనా మీ బోధా - వింటీ మీకూ
చాలనుచూ - అహమిచ్చు కుంటీ కృ
5. లీలా లేమియు - జూపానంటీ త్రి
కాలా మావలి - నిన్నే - గంటీ కృ
6. తప్పొప్పు లెన్నాగ - నేలా యెరుగ
ఒప్పగ నేనే-నీదై - తీగా కృ

7. తులసీ దాసుడు నీలో - గలిసే కాల
లీలాలన్నియు - నీలో నిలిపే క్షే

8. గురుదేవ గురుదేవ శరణం దేవ
గురుదేవ గురుదేవ శరణం క్షే

రాగం: శంకరాభరణం
తాళం : జుల్పతాళం

32.

కొదువే మున్నదే మనకు - గురునుతీజేయా
ముదమూన చిత్తా -చం - చలమూనూ బాయా ప

1. మాయా సంసారంబు - మరుపూనన్ దోయా
పాయక మదిలోన - పర చింతజేయా కొ

2. పాతకంబుల తోటి - ఫలమూలన్ రోయా
నీతీ మార్గము దప్పే - కూతాల న్బాయా కొ

3. వక్రా మార్గము నొచ్చు - ద్రవ్యంబు రోయా
చక్రీ వాక్యను గాని - మార్గంబు బాయా కొ

4. సర్వా జీవుల పట్ల - సమ భావము జేయా
ఉర్వీ జను - లజ్ఞానము - యూడించి దోయా కొ

5. అజ్ఞాన వశమయ్యే - నన్నిటి రోయా
జిజ్ఞాసులను దెప్పా - జలగాల బాయా కొ

6. గుర్వాజ్ఞ హీనత - గుణ రహితూ రోయా
సర్వార్ధ కారులమనె - గర్వాలా బాయా కొ

7. భక్తీ మార్గము లేనీ - రక్తాలను రోయా
వ్యక్తా మార్గము లే - నా - సక్తులను బాయా కొ

8. కల్లా మాటల వారీ - సల్లాపము రోయా
చెల్లా చెదురైయున్న - యుల్లాము బాయా కొ

9. నేననే హంకార - మును మదీ రోయా
కాననంబున జిక్కీ - వారినీ బాయా కొ

10. చరణా ద్వయమూ - లానూ - బాయూట రోయా
వర దైవమును రోము - వారినీ బాయా కొ

11. ఈ ధర కొమ్మూరు - మందిరము జేరా
శ్రీ ధరా న్వయజ కృష్ణ - శ్రీ గురునీ జే రా కొ

12. ధర యందూ బెన్నూరు - పుర వాసుడైనా
పర మోత్తాముడు తులసీ - దాసునీ గూడా కొ

# సూచిత ధర్మ - కర్మములు

రాగం: సామ

తాళం : ఆది

35.

1. సూచన దెలియుమురా - దీక్షిత సీవ్రా-
సూచన దెలియుమురా ప
సూచన దెలిసిన - వాచము లుడుగును
వాచము లుడుగిన - నీ చయమేదిర సూ

2. గుఱిగలిగుండుమురా - దీక్షిత సీవ్రా-
హరి సరి గుండు మురా .
గుఱిగలిగుండిన - హరిసరి నిలుతువు హ
హరి సరి నిలిచిన - గురు వడు బోచును సూ

3. కాలము దెలియుమురా -దీక్షిత సీవ్రా -
జాలము నొందుకురా .
కాలము నెరిగిన - జాలము దొలుగును
జాలము దొలగిన - మేలగు నీకును సూ

4. సరి సరి గుండుమురా - దీక్షిత నీవ్రా-
సరి సరి గుండుమురా .
సరి సరి గుండిన - సరియగు నీకును

సరి యగు నీకును - సరియగు నెల్లను సూ

5. పాదము దెలియుమురా - దీక్షితనీవ్వూ-
మోదము గుండుమురా .
పాదము దెలిసిన - గురుదయగలుగును
గురుదయగలిగిన -'సర్వము' దొలగును సూ

6. ఇహమును వదలుమురా - దీక్షిత నీవ్వూ
అహమును వదలుమురా .
యిహమహములను - యింపుగ బాసిన
సహజపు కృష్ణుని - సన్నుతి జేయర సూ

రాగం: సామ
తాళం : ఆది

35.

1. ఎఱుగర బ్రహ్మమునూ . దీక్షిత నీవ్వూ-
ఎఱుగర బ్రహ్మమునూ.
ఎఱుగర బ్రహ్మము - మరుగింతయు లేక
వరగురు బోధను - సరగున వినియును ఎ

2. ఆత్మయే వారధిరా . దీక్షితనీకూ-
ఆత్మయే వారధిరా .
ఆత్మయే వారధి- అచలము నందగ,
సచలము బాసిన - అచలము సిద్ధమే ఎ

3. ఎఱుకయే బ్రహ్మమనీ దీక్షిత నీవూ
ఎఱుగుము నిరతమునూ
ఎఱుకయే బ్రహ్మము - ఎఱుకయే విష్ణువు
ఎఱుకయే శివుడని - ఎఱుగుము మనమున ఎ

4. అంతట నగుపడురా - దీక్షిత నీకూ -
సంతస మనిపించురా
అంతటనున్నా - అచలము కనుగొని
యెంతయె జూచియు - లేనెరుకను వీడు ఎ

5. అచలమే పూనుమురా దీక్షిత నీవూ -
సచలము వీడుమురా
అచల స్వరూపుడు - అమితుడు కృష్ణుని
వచనము నంటుము - వర తులసిని బోలి ఎ

రాగం: భీంప్లాస్
తాళం : ఆది

37.

భావన జేయుమురా - మానసమూన ప॥

1. భావన జేయుము - భాగ్యము గలదని
భావన జేయుము - ధన్యుడవగుటకు భా

2. బ్రహ్మము నందున - భావము నిలిపియు
బ్రహ్మానందము - నందితిననియును భా

3. ఇల జగమంతయు -కలవంటిది యని
కల నెడ బాసిన - కేవలమేనని భా

4. వర గురు వేడిన- ఒడుదును గుటియని
నిరతము - గుటినీ- నెమ్మది- నుంచుక భా

5. శ్రీపతి పాదము- శీఘ్రమే - బట్టియు
నా పతి యనినను- నగుదును అటులని భా

రాగం: అసావేరి

తాళం : ఆది

38.

ఎఱుకను ఎఱుగుమురా - ఓనరుడా
ఎఱుకను ఎఱుగుమురా - ఓ జనుడా (2) . ప

1. ఎఱుకన నెఱుకే - మఱుపన నెఱుకే
ఎఱుక మఱుపులను - ఎరుగున దెఱుకే (2) ఎ

2. చలమన నెఱుకే - అచలము నెఱుకే
కల కాలముమది కదులున దెఱుకే (2) ఎ

3. యిహమున నెఱుకే -పరమున నెఱుకే
అహరహమిహమున-వాసిగను దెఱుకే (2) ఎ

4. స్థూలము నెఱుకే - సూక్ష్మము నెఱుకే
కారణ మాదిగ -కలిగిన దెఱుకె (2) ఎ

5. ధర్మము నెఱుకే - నధర్మము నెఱుకే
మర్మము దెలిపెటి - మరుగుయు నెఱుకే (2) ఎ

6. గురుడను నెఱుకే - శిష్యుడు నెఱుకే
యిరువుర యందును - యిమిడిన దెఱుకే (2) ఎ

7. నాదము నెఱుకే - వేదము నెఱుకే
మోదము గుండిన - బోధయు నెఱుకే (2) ఎ

8. ఆత్మయు నెఱుకే - అనాత్మయు నెఱుకే
పలుకులు బలికిన - పలుకది యెఱుకే (2) ఎ

9. కాలము నెఱుకే - జాలము నెఱుకే
మూలము లేనీ- ముజ్జగ మెఱుకే (2) ఎ

10. గురుతన నెఱుకే - మరుపన నెఱుకే
మరుపును బాపెటి - యెఱుకన నెఱుకే (2) ఎ

11. నీమము నెఱుకే - నిష్ఠయు నెఱుకే
కష్టసుఖంబుల - కారణమెఱుకే (2) ఎ

12. నీవన నెఱుకే - నేనన నెఱుకే
నీవును నేనును - రామన నెఱుకే (2) ఎ

13. మంత్రము నెఱుకే - తంత్రము నెఱుకే
మంత్రపు తంత్రపు - మర్మము నెఱుకే (2) ఎ

14. ఉన్నది యెఱుకే - లేనిది యెఱుకే
ఉన్నది వున్నది అన్నది యెఱుకే (2) ఎ

15. తలసియు నెఱుకే - తలపుయునెఱుకే
కలకాలము మది - నిలుపుట యెఱుకే (2) ఎ

# పిండాత్త బోధ్ధాలు



రాగం: వళజు

తాళం : ఆది

39. నీదేహమే 'నిధి' రా - మూనుజగను
'శ్రీ' దేహమే యిదిరా ప

1. నీదేహమె నిధి -నిఖిలము దెలియగ
శ్రీ దేహమె యిది - సకలము నిముడుగ నీ

2. అండ పిండ బ్రం- హ్మాండం బంతయు
నిండి యుండెనీ -ఖండము నందునె నీ

3. పదునాలుగు సరి - భువనము లన్నియు
చెదరక నీదే -హము నిముడుండిన నీ

4. ఐదైదుల తత్వంబుల - నధిపతు
లందరు నీతను- వందునె నిమిడిన నీ

5. పంచ భూతముల - సంచిత మిదియని
వంచన లేకను - ఎంచిన దెలియును నీ

6... చక్రము లారిట - చేతన మయ్యిన
చక్రి నివాసం - బీతను వనదగు నీ

7. దేహము దేహము - యనినను నీవిక
మోహము జెందక - దేహిని నిలిపిన నీ

8. ఉన్నది లేనిది - యెన్నున దీ తను
వెన్నడు దీనిపై - మన్నన మరువకు నీ

9. ఎఱుకని మఱుపని - ఎన్నియో యన్నను
నిరతము పరిపూ -ర్ణంబును జూపెటి నీ

10. ఎను బది నాల్గులా - క్షల యోనులపై
కన గలిగిన యీ - తనువు నవశ్యము నీ

11. సత్యమ సత్యపు - సత్యము దెలిపిన
సత్యపు తనువును - నిత్యము వీడుము నీ

12. సత్యము గురుడు - నసత్యము తనువని
సత్యము దెలిపెటి - సాధనమిదిగను నీ

13. సకల దేవతల - సాక్ష్యం బిదెగను
అఖిలంబున కా -రాద్యం బిదెగాను నీ

14. పరి పూర్ణంబున - తొలి పూర్ణమె యిది
యని మది నిశ్చయ - మొందగ జేసెటి నీ

15. తులసి దాసుడిల - కొలచిన తనువు
కృష్ణ దేశికుడు - మలచిన తనువు నీ

నోట్ :- సా- ా-ప-నీ-ా-ప
నీ- దే-హ-మే-ని-ధి-రా

రాగం: తిలకామోద్

తాళం : ఆట

46.

1. గురునామమునూ - గురునామమునూ
మది నిరతమునూ
సుధ లొలుకగను -నీవు
జపియించరా -ఓరి నరుడా
నిన్ను కడ తేర్చురా - పామరుడా గు

2. జన్మరహితంబును - కలుగ జేయుగద
కర్మచయము నంత -కాల్చివేయుగద
నిర్మలం - బగు మది -నిలుప జేయు గద
మర్మ మరసి - నిలువుర నీవూ - నరుడా
సర్వ - భ్రాంతు లీడేరు - పామరుడా గు

3. లేదు లేదన్నను - నీవు కాదన్నను
వాద భేదమన్న - నాద వశమే నన్న
నీదు జ్ఞానం బంత -నిద్దముగ లేకున్నా
నిన్ను దరి జేర్చురా - ఓరి - నరుడా
కన్నా -గురువును జేరు -పామరుడా గు

4. గురు రూపంబును - ధరు పాదంబును
వరు వాక్యంబును - స్థిరు గోప్యంబును

పర సూత్రంబును - సుర గాత్రంబును
నీవు స్మరియించర - ఓరి - నరుడా
నిన్ను - కరుణించురా - పామరుడా గు

5. మలము మూత్రము కొంప - చలములన్నిటి గంప
మానసంబును జంప - బాణాలన్నిటి దెంప
కోనాలన్నిటి నింప - నీనా యన్నదె పంప
నీవు జపియించురా - ఓరి -నరుడా
యితర మార్గంబే లేదు - పామరుడా గు

5. వరశ్రీ కృష్ణ గురునీ - నిరతంబును మదిలో
మరువక స్మరియించిన- మరి రావుర - నీ విల్లపై
ఈ మరు - గెరిగరి గేనా - పామరు తులసీ వరునీ
నీవు - నమసారించర - ఓరి నరుడా
నిన్ను గాంచును - సద్గురు -ధీవరుడా గు

రాగం: కళావతి
తాళం : ఆది

4̣1̣.

గురు ధర్మమే స్థిరమూ - మానవ విను (2) ప

1̣. ఇహ పరముల మరు -గంతయు దెలిపెటి
అహ మంతయును - అంతము జేసెటి గు

2. ఇతర మతంబుల -నిదినది యుండగ
వితరణతో నివి - వలదని దెలిపెటి గు

3. మతమిది గాదని - సతతము దెలియర
జతనము దెలిసిన - నీమతి బాపెటి గు

4. నీవారెవ్వరు -నీ సరి గారని
అవ్వారల మది - నావల దోసెటి గు

5. అందని పదవిని - అందగ జేసెటి
సుందర పథము-నీ - ముందర నున్నదే గు

6. మాయ పనుల నీవు - తోయక యున్నను
ఓయని దలచిన - గురు దయ జూపెటి గు

7. వలదని వలదని - వారించిన నిను
వదలక వలచెడి - మాయను బాపెడి గు

8. శ్రవణాదులచే - బొందగ లేనీ
భవ రహితంబగు - బోధను దెలిపే గు

9. మానవ యనునీ - మారగు పేరును
మాధవ యనినీ - మది కుదురగ జేయు గు

10. సాధనముల నివు - చతికిల బడినను
మోదము తోడుత - మునునిను గన జేయు గు

11. సత్క్రియలన్నిటి - సతతము జేసిన
నిష్క్రియ నీ -రూ-పము గన జేసెటి గు

12. తులసి దాసుడిల - తలచి తరించిన
కల కాలము యిల - నిలచిన ధర్మము గు

రాగం: దుర్గా
తాళం : ఆది

42.

భగవంతుడు - నీ - భావనములున్నాడు
భద్రముగను - నీవు - భయపడవలదుర ప

1. జపములు తపములు - జేయక యున్నను
కపటము వదలియు - కొలిచిన చాలుర భ

2. భయ భ్రాంతుల నీవు - వదలియు వేగమే
దయ జేయును మ- మ్ముల వేగ రమన భ

3. హరి నామంబును - మరువక దలువుర
హరి హరి పుర హరీ - వరగురు శ్రీయన భ

4. భవ బంధంబుల - భయపడ వలదుర
శ్రీవని తేశుని - శ్రీ క్షమే వేడుము భ

5. సాధనముల వల - సంతలో బడకుర
శ్రీధనమున నీవూ - చిత్తము నిలుపుర భ

6. నీవన నెయ్యదో - నింపుగ దెలిసిన
తోవను జూపును -శ్రీహరి సన్నిధి భ

7. భావమే భవ్యము - నామమే దివ్యము
ధామమే ధన్యము - ధీమంతుల కుర భ

8. నిత్యానందుడు - సత్యుడు కృష్ణుని
సత్యము నమ్మిన - తులసిని గలువర భ

రాగం: జైజైవంతీ
తాళం : జుల్వ

43.

దానము జేయును సురజన్మ
దానాంతము దెలియును పరజన్మ ప

1. ధర్మము జేయును సురజన్మ
ధర్మంబున గలియును పరజన్మ దా

2. సరి పని జేయును సుర జన్మ శ్రీ
వరగురు జేరును పరజన్మ దా

3. జపములు జేయును సురజన్మ
జపతపములు తెలియదు పర జన్మ దా

4. కపటము లేనిది సురజన్మ యే
నటనలు లేనిది పర జన్మ దా

5. యిహమున నిలియును సురజన్మ
అహ - మావల కలియును పరజన్మ దా

6. కల్లను రోయును సురజన్మ తన
యుల్లము బాయును పరజన్మ దా

7. వేదము దెలియును సుర జన్మ
వేదాంతము గలియును పరజన్మ దా

8. తులసి నామమే సురజన్మ .
కలనామ రహితమే పర జన్మ దా

రాగం: కాఫీ

తాళం : ఆది

44. మానవా - మానవా - మర్మరహిత జన్మా
ఆపై నీవ్రా- ధర్మ రహిత జన్మా ప

1. ఎన్నియో జన్మల - పుణ్యఫలంబున
తిన్నని మానవ - జన్మము గలగెను
పన్నుగ గురువరు - మన్నన బొందియు
సన్నుతి జేయను - సరగున వీపి క మా

2. సతి సుతులందరి - హితమును గోరుచు
సతతము నీవిల - సంతస మొందుచు
రతి సుఖమరియు -హితమును దెలియక
పతివని నమ్మియు -శ్రీ పతివేడగ మా

3. ధర్మము మర్మము - ధరణిలో నిలుపగ
కర్మము లెల్లను - కూరిమి జేయుచు
నిర్మలగుణుపై - నిజగురు మార్గము
సర్వము నందున -సరిగ వర్తించగ మా

4. ధరణి కొమ్మూరు- పురములో వెలిసియు
కరుణచే భక్తుల -వరముల నిచ్చియు
నరవరులందరి - సరగున బ్రోచెడి
వరగురు కృష్ణుని - నిరతము వేడగ — మా

5. రాగము భోగము - రమ్యము నంతయు
త్యాగము జేసియు - తిరమ్మైయున్నా
ఆగము నిగమము -లందలి భావము
వేగమే బొందిన- తులసిని గూడ — మా

రాగం: భైరవి
తాళం : ఆది

45. మోహము జెందకురా -ఓ నరుడా .
మోహము జెందకురా — ప

1. మోహము జెందిన -శ్రీహరి దెలియడు
శ్రీహరి దెలియక - గురువరు జేరవు — మో

2. కామము గలిగిన - క్రోధము మొదలగు
క్రోధము గలిగిన - లోభము మిగులును — మో

3. లోభము వలనను - మోహము సిద్ధమే
మోహము వలనను - మధము ప్రసిద్ధమే — మో

4. మధమును ముదమున - తొలగగ జేయగ
వదలక కృష్ణుని- సదనము జేరుము — మో

5. తలచగ తలచగ - నిలుచును మనమును
తులసిని గూడిన - తొలుగును భయమును మో

రాగం: భైరవి
తాళం : ఆది

46.

1. మానవా - మాధవు -గొలువుమురా (2) ప
మాధవు గొలిచిన -బాధలు లేవుర
బాధలు బాసిన -స్వర్గము నీదెరా మా
2. మానవా -నామము - దలువుమురా
నామము దలిచిన - కామనలుడుగును
కామనలుడుగ -శ్రీ- ధామమే నీదిర మా
3. మానవా - మంత్రము - దెలియుమురా
మంత్రము దెలిచిన -తంత్రము సులువగు
తంత్రము దెలియ - మంత్రార్థము నీవేరా మా
4. మానవా - పాదము - బట్టుమురా
పాదము బట్టియు -ఎఱుకను బాసిన
మోదపు తులసిని - నీయెదనుంచుక మా

రాగం: దర్బార్ కానాడా
తాళం : ఆది

47.

ఎందుకురా - దిగులూ - మానవనీకు
ఎందుకురా దిగులూ ప

1. ఎందుకు దిగులుర -ముందుకు నడువర
యిందు వదను - మన - నంది వాహనుడుండ ఎం.

2. నిర్వేష పోషుడు - సర్వేశుడీశుడు
నిర్వాకారా గురుడూ - నిత్యుడైయుండగ ఎం

3. బాధల నన్నిట - బోధను నిలిపిన
మాధవు గురు మన వాడైయుండగ ఎం

4. లయ గుణ యుతుడు - రయమున హితుడు
భయ భ్రాంతుల నెల్ల - బాపెటి హరుడుండ ఎం

5. తులసి దాసుని వరుడు - యిలలో కృష్ణా గురుడు
తలచిన తోడనే -ఫలమీయుచునుండ ఎం

రాగం: శంకరాభరణం
తాళం : ఆది

47.

భావమే భవ్యమురా - ఓ నరుడా నీకు
భావమే భవ్యము రా ప

1. భావమే భవ్యము - దేవుని గలువను
భావాతీతుడు - దేవుని వేడుము భా

2. దేహమే వలయమురా - ఓ నరుడా నీకు
మోహమే - కా- రడవిరా
మోహమే విషమయ - బీజంబాయెను
శ్రీహరి వాత్సాల్య - మనునదె - అమృతం భా

3. ఇలయే నరకమురా - ఓ నరుడా నీకు
కలయే నరకమురా
ఇల కల లన్నిటి - యింపుగ బాసిన
ఫలమగు మోక్షము - సులభము గదరా భా

4. అహమే అంతమురా - ఓ నరుడా నీవు
సహజపు దేవుడువూ
అహమంతటిని -హరి- సన్నిధి నిలుప
ఇహమంతయు నింపుగ స్వర్గమెయను భా

రాగం: దుర్గా
తాళం : ఆది

49.

నిద్దుర నీకేలరా ఓ నరుడా
శుద్ధముగను లేవరా ప

:. సదమల హృదయా - పదపడి లేవగ
మదనమోహనుదయ -ముదమున బొందగ ని

2. నిను మది దెలియగ - కనులను గలువగ
చలరహితంబున - నిలువను నీకిక ని

3. వలపును వదులుగ - తలపును దొలగగ
ఇలపై ధర్మము - స్థిరముగ నిలుపగ ని

4. మోహము వదులగ - భావము నిలుపగ
దేహము లన్నిట -శ్రీహరి జూడగ ని

5. పరువపు ఎరుకను - స్థిరముగ బాపగ
గర్వము వీడియు - గురువరు వేడగ ని

6. భక్తిని నిలుపగ - యుక్తిని దెలుపగ
శక్తిని జూపిము - ముక్తుని గావగ ని

7. అజ్ఞానంబును -అంతము జేయగ
సుజ్ఞానంబును - యెంతయో బెంచగ ని

8. దైవము దెలియగ - దైవము గలియగ
దైవము గలిసిన - తులసిని గూడగ ని

రాగం: అసావేరి
తాళం : ఆది

5:.

ఇలజగమంతయు - "కళ" "స్వప్న" మురా
వలవలెనున్నను - ఫల శూన్యమురా ప

1. ''కళ'' వలె నున్నది - 'కల' వలె నున్నది
ఫలముల నీయగ - వదలను చున్నది ఇ
2. సతిసుతులందరు - వెతలకు మూలము
పతి యని నమ్మక - అతిగ జెడెదరిల ఇ
3. అందక పొందక - బంధక మగుచును
ఇందు వరదు నెందు - చెందగ నీయదు ఇ
4. రూపము దెలుపక - పాపము నిలుపును
పాపము బాయక -రూపము దెలుపదు ఇ
5. కృష్ణాచల ప్రభు - కూరిమి బ్రోవగ
తృష్ణలో తులసిని - కూరగ జేసిను ఇ

రాగం: చంద్రకౌంస్
తాళం : ఆది

51.

మోహము వదలుమురా - ఓ నరుడా (2) ప
1. మోహము వదులర - భావము నందున
దేహపు వాసన - దోయుము కడకుర మో
2. అన్నది విన్నది -కన్నది నిజమని
యెన్నడు నీమది - నంటగ నీయకు మో
3. వీనుల విందుగ - విన్నది దెలిసియు
కన్నుల నిండుగ - కాంచుము హరినిర మో

4. కల నిజమను కొని - వలపును జెందకు
అల వలె నున్న -యీ - వల జగ మీదర మో
5. దాసుడు తులసి - నీ - పాదము మ్రొక్కియు
ాసిలు చుండెను - మోహము విడుమని మో

రాగం: భైరవి
తాళం : ఆది

52.

గురుని నుతించర -హరిని భజించర
వరగురు శిష్యా - నిరతమునూ ప
1. సదమల హృదయా - పదములు వదులకు
సదుగురు శిష్యా - నిరతమునూ గు
2. రాగము మోహము -భోగము లన్నిటి
త్యాగము జేయుము - నిరతమునూ గు
3. నీమము దప్పక -నిజగురు నామము
ానము జేయుము - నిరతమునూ గు
4. గురు పదమెప్పుడు - గుండెలో నిలిపియు
గుణముగ నుండుము - నిరతరమునూ గు
5. అందర యందును - ఆత్మను గనుచును
పొందుగనుండుము - నిరతరమునూ గు
6. అన్నది విన్నది - కన్నది భ్రమయక
సున్నగ నుండుము - నిరతమునూ గు

7. తలచిన తడవే - తులసిని బ్రోచిన
కృష్ణుని వేడుము - నిరతమునూ గు

# ఆత్మ బోధ

రాగం: అసావేరి
తాళం : ఆట

53.

ఏమానందునె మనుసా - ఎంతెంతో వగచేవు
శ్రీ-మనోహరు - దలుచావే ప

1. కల్ల మాటల - నెన్నో జెప్పెను
వుల్లమును -రంజిల్ల జేయగ
మెల్ల మెల్లగ - నీదు చేష్టలె
సుల్ల జగమున - అల్ల జేసేవు ॥ ఏ ॥

2. మాయ సంసారంబు - రోయగ
మరుపు నందున - దోసి వేతువు
కాయనూది సమస్త -హేయను
న్యాయనుగునని - నమ్మియుందునె ఏ

3. చాలు చాలని - యెంతో చెప్పిన
కాలునీ దరి - బోక మానవు
పాలు మాలిన - పనుల నెల్లను
వోలలాడుచు - జేయు చుందువు ఏ

4. దారి దెలియక - ఘోరసం
సారంబునందున -కూలియుందువు
సూరి జనములు - మెచ్చు గురువరు
పదములంట - వదేమి జేతును ఏ

5. చేయు తప్పులు -నొప్పి దంబని
గొప్ప గను బహు - బల్కుచుందువు
అప్పయ్యె మన - తప్పులను నెర
బాపు చుంచెడి - కృష్ణవేడవు ఏ

రాగం: భీంప్లాస్
తాళం : ఆది

54.

ఓ పగ లేకున్నర - మాధవ - నేను
ఓ పగ లేకున్నరా ప

1. పాపము లెన్నియో - జేసిరి జనములు
నీపయి ప్రేమను - బాసిరి మనమున ఓ

2. ధర్మము దప్పిరి - మర్మము మరచిరి
కర్మము జేయక - కడు సుఖమొందిరి ఓ

3. మమతలు మరచియు - కుమతులు బెరిగిరి
సమతయు గోరుచు - ద్విమతము జూపిరి ఓ

4. నిను మది దలువరు - తనమది దెలియరు
సనకాదుల మది - సన్నుతి జేయరు ఓ

5. అరిషడ్వర్గంబుల - నతిగనువలచిరి
మరి వర్గంబుల - సరి యని నిలిపిరి ॥ ఓ ॥

6. పెద్దల నమ్మరు - సుద్దులు విన్నాను
గద్దరి చేతలు - ప్రొద్దున జేతురు ॥ ఓ ॥

7. వరుసలు మరచిరి - సరసము లాడుచు
పరుషము బెంచిరి - కురుచన యగుచు ॥ ఓ ॥

8. సజ్జను లందరి - చవటల జేసిరి
కొజ్జల గూడుచు - కోతలు గూసిరి ॥ ఓ ॥

9. మరి మరి వేడెద -సరి జేయుము దొర
కరి నేలిన హరి - మొరవిని బ్రోవర ॥ ఓ ॥

10. తులువని తులసిని - అలుసుగ నెంచేరు
నెలవుగ కృష్ణుని - తలపున దలువరు ॥ ఓ ॥

రాగం: కలహారప్రియ
తాళం : ఆది

## 55.

చాలు చాలుర -యీ- సంసారం !మదీ
చాలు చాలుర - యీ- సంసారం ॥ ప ॥

1. పంచ భూతముల - వంచన చేనేను
సంచిత కర్మల - పంచన బడితిని ॥ చా ॥

2. పరి పరి విధముల - పరుగులు బెట్టియు
నిరతము మరచితి - నిజగురు నామము ॥ చా ॥

3. సకలము నందున - సరిగవర్తించిన
వికలుడనైతిని - సకలము బాయక చా

4. కర్మలు జేసితి - మర్మము దెలియక
నిర్మలు జేరక - నీరస మొందితి చా

5. ఎఱిగితి ఎరుకను - మరిగితి ఎరుకకు
సరగున ఎరుకను - సాగనంపగనైతి చా

6. కల వలె జగతిన - అలవలె నిలచిన
మలి తులసీ కల - నింపుగ వీడర చా

రాగం: దేసగాంధార
తాళం : ఆట

55.

ఎంతా మోసపు కారివె - మనుసా : నీవ్రా
పంతా మేలను జేసే దావ్రా ప

1. కాంత కనకము - రోయలేవ్రా
యెంతగనో - చింతించె దావ్రా
నిన్ను నీవు - దెలుపాగ - లే
కన నంధునిగ జేసెద వీవు ఎం

2. బ్రహ్మ విష్ణుల -దలుచనీవ్రా
వారలను మది -గలువ నీవ్రా
ఆశ లెన్నియో -బెంచియూ మరి
మోసపుచ్చగ - నెంచి నావ్రా ఎం

3. వాయు వాత్మజ - వీడు నన్నూ
పాయదలచితి- నీడు జోడూ
లేక దోచిన =యెఱుకె నీవూ
శ్రీకరుని చెంతాకు - దోయూ ఎం

4. ఓపజాలను - నీదుమాయా
శ్రీ పదంబుల - నెరు'గ జేయూ
తులసిపై - అలుకేల నీకును
వలచితీ -కృష్ణుని చాలగ ఎం

రాగం:కళ్యాణి
తాళం : ఆది

57.

మధురం మధురం - మధురం మధురం
మధురం మధురం -మధురం మధురం ప

1. జననీ జనకుల -సంగము మధురం
జన్మించుట మరి - మధురం మ

2. పాలవయసు తన - లీలలు మధురం
చాలగ పలుకుల - వోలలు మధురం మ

3. తప్పు చుండు తన - నడకలు మధురం
ఒప్పుగ పెద్దల - నడతలు మధురం మ

4. బాల్యమున బల్ - వయసును మధురం
తుల్యత లేనీ - తాలిమి మధురం మ
5. కౌమారంబున - కూరిమి మధురం
ముదిమి వయసున -మోదమె మధురం మ
6. ఇహ పర మొదులట -యింపుగ మధురం
సహజపు మాయను- రోయుట మధురం మ
7. ఇహమును రోయుట - యెంతయొ మధురం
అహమును బాయుట - అంతయు మధురం మ
8. తులసిని గూడుట - తలుచగ మధురం
కృష్ణుని వేడుట -మరి మరి మధురం మ

రాగం:దర్బార్ కానడ
తాళం : ఆది

58.

చలనా-మెందుకు నీకూ - దాసా - మదీ
మలినా మెందుకు ధర్మ పోషా ప

1. సాధనంబులు - జేసేవేలా
బోధలందున - దిరుగుటేలా
ఎన్నోకర్మలు -జేయుటేలా
యెన్నగా గురు - జేర లేక చ

2. పాశముల మడి - జిక్కు టేలా
కీలు దెలియక - సోలు టేలా
పుణ్యకర్మలు, జేయు టేలా
పుణ్యమేమిటో - దెలియకున్న చ

3. నిక్కముగను - నీవు లేవ్రా
చక్కగా దెలియూము -తావ్రా
యెన్నో జన్మల - నెత్తినను నీవు
సున్నగావలె - ననవ దేమి చ

4. కృష్ణ దేశికు - వేడవేమి
తులసీ దాసుని - గూడవేమి
నిష్ఠ సరసన - నిలువగను -నీ
తృష్ణలన్నియు -వీడవేమి చ

రాగం:మోహనకళ్యాణి
తాళం : ఆది

59.

ఏల జనించితివి - నీ వేలను - అణగితివి.
లీల వంటి - జాలమెరుగుము- నిత్యసుఖదాయీ ప

1. కాలపు మహిమను దెలియగవైతివి
చాలగ మరుపున - మసలుచు నుంటివి

గురువరు దెలియర -వరములు బడయర
శ్రీహరి వర తనయా...................... ఏ

2. మోక్షము గలుగును -సూక్ష్మము దెలిసిన
ఈక్షణ మొదలక - దీక్షను బొందిన
చరణము బట్టర - మరణము బాయర
శ్రీ హరి వర తనయా ...................... ఏ

3. పొలను బోలిన - కల రహితంబును
జాలము జేయక - జాగ్రత నందియు
మేలని నమ్మియు - పొలుగ నుండర
శ్రీహరి వర తనయా........................ ఏ

రాగం:బిలహరి
తాళం : ఆది

66.

కలను జయించర -ఇలను ఫలించర
వలసిన దానిని - వదలక పొందర ప

1. ఆవల యీవల - అంతట జూసియు
కావలె నీవుర - కేవలం బ్రహ్మము క

2. ధన ధాన్యంబుల - మురిపెము నొందక
కనకంబుల నిల - చులకన జూచియు క

3. చదువుల జదివిన -పదవులు నొందిన

కదులని దానిని -గురునిచే బొందర క

4. చలనము నొందక - మలినము లంటక
కలవర మొందక -కాలము గెలువర క

5. తులసిని విడువక - కలుసుట మరువక
వేలుపు కృష్ణుని -వదలక వేడర క

రాగం: శివరంజని
తాళం : ఆది

5[illegible].

ఎందుకు గలిగెను - ఈ నర జన్మ
సుందర రూపుడు -శ్రీహరి గననిది ప

1. మంధర గిరిధరు- మదన మోహన కృష్ణ
వందన మొనరించి -వారిగ పోవని తనువు ఎం

2. కంసుని పరి మార్చి -హింసను దునుమాడు
హంస స్వరూపుని అంశము గననిడ ఎం

3. సంచిత కర్మల - సవరణ కొరకై
అంచితముగ -హరి- ధ్యానం బెరుగని దెం

4. సాధన సేవయే - మధుర మధురమని
ఈ ధర నమ్మక - బాధలు నొందున దెం

5. ధరణి బెన్నారు - పుర- వాసుడు తులసీ
హరిని గన్నారని - సరగున దెలియని దెం

రాం:మాయామాళవ గౌళ

తాళం : ఆది

52.

ఏలనీ - భ్రమసితివీ - యీతనువును .
ఎందుకు వలచితివీ ప

1. ఏలని భ్రమసెద - వీమల కూపము
కాలుని లీలల - కాలయ మిడెయగు (3) ఏ

2. నఖ శిఖ మంతయు - నరముల జాలమె
పక పక నవ్వగ - జేయును వలచిన ఏ

3. మల మూత్రంబుల - మడుగని ఎరుగవ
కల లోపలి సిరి - వలెనిది గనరా ఏ

4. మాంసము మజ్జయు - మరిరుధిరంబును
ధ్వంసము జేయును - నీ నిజ జ్ఞానము ఏ

5. దోషంబులు పలు -గాసిల జేసియు
మోసముజేసెటి - మోదపు యంత్రము నే .

6. నీటి బుగ్గవలె - నిగ్గిన యీ తను
వాటము గొగ్గను - వలదన్నను విను ఏ

7. ఆత్ముడు నిత్యము - అండని యుండగ
స్వాంతంబున తన - చేష్టలిడని తను వే

7. ధరణిలో బెన్నూరు -దాసుడు తులసియు
స్థిరముగ రోసిన - ఖరసము దేహము నే

రాగం:హరికాంబోజి
తాళం : ఆది

63.

1. బోధ మరుగు గురు -పుత్రుని కెరుకా
బాధితమైయున్నా - బడుపకేమెరుకా ప

2. పాపపుణ్యంబులు - పరునాకే ఎరుకా
పలువరించుచు - నుండే - పాపికేమెరుకా బో

3. ధర్మా ధర్మంబూలు - ధీరున కెరుకా
కర్మాలు జేసేటి - కర్మికేమెరుకా బో

4. నిత్యా నిత్యంబూలు - నిత్యూన కెరుకా
సత్యా భావము లేని - సంతూకే మెరుకా బో

5. మంత్రరహస్యంబు - మన నాశీలుని కెరుక
తంత్రంబులను జేర్యా - దొంతీకేమెరుకా బో

6. తత్వ మూలం బంత - తరువరికెరుక
కపటత్వమెుం దేటి - ఖలునికే మెరుకా బో

7. అక్షయ మగు బోధ - దీక్షితు కెరుక
మక్షికమును బోలు - కుక్షీకే మెరుక బో

8. రాజ యోగము - మరుగు- గురురాయు కెరుక
అజ రుద్రులనుగొల్చు - ద్విజునకేమెదుకా బో

9. ఆత్మ స్వరూపంబు - అమలూని కెరుక
మల త్రయంబుల జిక్కూ - తులువకేమెరుకా — బో

10. సూరి జనముల బాట - సురవరు కెరుక
కారు కూతలు గూయు - కపటీకే మెరుకా — బో

11. గురు గానమును జేయ - గుణవంతు కెరుక
సరి జ్ఞానామును లేనీ - చవటకే మెరుక — బో

12. వేదాంత సారంబు - బోధాపరునా కెరుక
వాద భేదము నొందు - గూబా కే మెరుక — బో

13. కృష్ణదేశికు బోధ - కూడూ వారల కెరుక
తృష్ణలో జిక్కినా - పశ్వుకే మెరుకా — బో

14. తులసీ దాసుని మనసు - తుల్యునీ కెరుకా
అలుసూ భావము గల్గా - నలుసూ కే మెరుకా — బో.

రాగం: శివరంజని
తాళం : ఆది

54.

మనసా - పయనింపవే - గుర్వుని బాట (2) [illegible]

1. జనన మరణ [illegible]
అరిషడ్వర్గంబు [illegible]
మరచి పోకు - [illegible] ధర్మమే [illegible]

2. నీ లింగంబులు [illegible]
భంగ [illegible]
[illegible]

సంగము జేసియు - సాయుజ్య మొందుము ॥ మ ॥

3. నాలుగు తనువుల - నావల - నున్నట్టి
భావము దెలిసిన - బహురమ్యమురా
నీవలె నిష్టులు - జగతిన లేరూ ॥ మ ॥

4. నీ మూలము నీవు - కనుగొన వలెనన
నిజగురు మార్గము - నింపుగ బాడుము
కారణ పురుషా -శ్రీ- గురు బోధను ॥ మ ॥

5. దశపష్టంబుల - దునిమిన తడవే
దశమున పైరెండూ -దర్శన మౌరా
నిత్యుడు శ్రీ గురు - నిను గాచియుండును ॥ మ ॥

6. సకలము నందున - వికలము నొందకు
ప్రకటముగా గురు- భావము దెలియుము
కృష్ణుని గూడిన - మార్గము సులువగు ॥ మ ॥

## తత్త్వ [illegible]

---

65.

1. బయలు గను పర సూత్ర మెరుగన్నా ॥ సద్గురుని
కృపచే - నిరతమును - నది మరువ బోకన్నా ॥ ప ॥

1. బయలు గనె పర సూత్ర మెరిగి
ద్వయము నంతయు -దొలగ జేసియు

నియమ న్నిష్ఠలు -గలిగి నీవును
నిత్యమును - పఠియించుచుండుము ॥ బ ॥
2. కోపతాపము లెల నీకన్నా . నరకంబు బోలిన
ఎఱుక కూపము విడుచు చాలన్నా
పాపయిందలి - పరమ పురుషుని
ఆడ దెలిసియు - అవలదోసియు
పవలు రాతిరి - మరువకను యీ
మఱుగు దెలిసియు - మిన్న కుండుము బ
3. గురుని పదములు మరువ బోకన్నా . గూఢంబు
దెలిపెటి - వరుని సదనము వీడ బోకన్నా
గురుని వాక్యము - గుట్టునంతయు
నిరతమును - నీ- మదిలో నుంచియు
స్థిదుల నందర -గూడగను నీ
సిదుల నెల్లను -గుఱిలో గలుపుము బ
4. చూపులోని చూపు చూడన్నా . చూడంగ నీకును
మూలమయ్యిన ముల్లు దొరుకన్నా
ముళ్లు చేసనే - ముల్లు యందలి
మూల మర్మము - మొనసి కనుగొని
చాలు చాలని మూల -ఎఱుకను
బాసి బయలున - బయలు గమ్మర బ

5. నాల్గు నాల్గుల నాన్క మిడువన్నా ఆపైననీకు
మూడు నాల్గు భావమబ్బన్నా
ఎఱుగు చుండియు - తరుగు చుండియు
అఱుగు చుండెడి - ఎఱుక నెరిగియు
అనవరతమును - ఎఱుక నెరుగని
స్థిరపు బయలును - అంటి యుండుము బ.

రాగం:మోహన
తాళం : ఏక

65.

1. ఆడు కుందామా - మనము - పాడుకుందామా
శ్రీ గురునీ మదిలో నమ్మి - వేడుకుందామా ప
2. రూపము లేనీ - మరి - పాపము లేనీ
యా పరంధాము - నెపుడు- వేడుకుందామా మ.ఆ.
3. మనదు తప్పులా - మన్నించు చుండెడి
మాననీయుడైన - గురుని- వేడుకుందామా మ.ఆ
4. భేదము లేని - ఆధారము గానీ
నాథుడైన కృష్ణ గురుని వేడుకుందామా మ.ఆ.
5. వాదము లేనీ - నిర్వేదము గానీ
సాధనా తీత -గురుని - వేడుకుందామా మ.ఆ

6. సర్వ శుభములా - పుర్వి -జనులకు నిచ్చు
నిర్విశేష నిర్గుణుని - వేడుకుందామా మ. ఆ
7. దాసులందరి - దోష- మెంచగబోకా : పాశంబుల
ధ్వంసము నట్టి పరమ గురుడనీ మ. ఆ
8. యోగము లేనీ - మరి- భోగము గానీ!
రాగ త్యాగ లక్షణముల రమణునెప్పుడూ మ. ఆ
9. తత్వము గానీ - మరి - సత్త్వము గానీ :
నిత్యుడైన నిజగురునీ వేడుకుందామా మ. ఆ.
10. మాయ రహితునీ - మరి- కాయరహితునీ
పాయకుండ హృదిలో మనము వేడుకుందామా మ. ఆ
11. చింతలు లేని - మరి- పంతము గానీశ్రీ
కాంతుడైన కృష్ణ గురుని వేడుకుందామా మ. ఆ
12. నలు పొద్దులందునా - పలు -సుద్దులందునా : హద్దు
లేక నిండు గురుని వేడుకుందామా మ. ఆ.
13. సురల యందునా - గిరి తరులయందునా .
పర భేదము లేక యుండు పరమ గురుడనీ మ. ఆ
14. ఆవరణము లేనీ - గురు- స్థలము నందునా
ఆవలీవలనక మనము ఆడుకుందామా మ. ఆ
15. ధరణి యందునా - కొమ్మూరు పురము నందునా
ధాముడైన తులసి దాసు దైవము నెపుడు మ. ఆ

తాళం : ఆట

57.

1. ఎందుకయా బోధ - యెందుకయా ! గురు
సంధి దెలియని వార్కి - కెందుకయా ప॥

2. తను మన ధనములూ - తనవద్దయుంచు కొని
తగు నంచు దీక్ష - గొన్న టెందుకయా ఎం॥

3. గురు మంత్రమని యేటి - గుద్దాలి తోటి యీ
యెరుక కూకటి వేరు - యెఱిగి త్రవ్వని వాని కెం॥

4. తల్లి దండ్రుల బాసి - తన యాలు పైజేసి
యుల్ల మందున గురుని - నొల్లనీ వానికీ ఎం॥

5. నేనె భక్తుండను - నేనె రక్తుండను
నేనె శిష్యుండనని - నెఱనమ్మ వారికి ఎం॥

6. పర ద్రవ్యముల పట్ల - పరస్త్రీల పట్లనూ
నిరతంబు మదినిల్పి - నీచాతి నీచులకు ఎం॥

7. మంత్ర తంత్రంబులలో - మునిగి తేలుచు నుండి గురు
మంత్రంబు నొందెటి - గుణము లేని వారి కెం॥

8. ఎఱుక మూలము లేని - ఎఱుగుండే ప్రతిదినము
ఎఱుకందు ఏరుపేరై - పాఱుచుండెడి వారి కెం॥

9. దేవ గుణములు [illegible] గుణములు [illegible]
[illegible] కావ రంబున [illegible] కర్మ [illegible] ఎం.

10. గురు ధర్మమును దప్పి - తన ధర్మమున నొప్పి
చనట్లులై తిరిగేటి -చపలులకునూ ఎం

11. నీమ నిష్టలు లేక - నిజమందు మతి లేక
నీతి మాటలు బల్కు - నీచులకునూ ఎం

12. ఉన్న దాని యందూ - వుండ- తరమవ్వకా
లేనట్టి ఎఱుకలో - లీనమయ్యేటి వారి కెం

13. పెద్దలా మాటలా - పెడచెవిని బెట్టియూ
హద్దు లేకనె తిరుగు - బద్ధులకునూ ఎం

14. నిర్ధమౌ భక్తిచే- నిజగురుని గొల్వక
గొప్ప మాటలు గుప్పు - గూబలకునూ ఎం

15. గురు మూర్తి పాదంబు - గుఱియందు నిల్పక
గుడ్డెద్దు వాటమ్ము - గుణుగు వారికినీ ఎం

16. అభిమాన యుతుడయ్యి -శృంగార రతుడయ్యి
శ్రీ కరుండగు గురుని - చీదరించెడివాని కెం

17. తత్వమూలంబునూ - తాదెలియ లేకనూ . యే
కత్వ మైతినని - ఎగిసెగిసి పడువారి కెం

18. ఆత్మ స్వరూపంబు- నమరంగ దెలియక
అంత టుందని బల్కు - నల్పులకునూ ఎం

19. కృష్ణ దేశికు మాట - దాస దాసుల బాట
అలుసంచు మదిలోన - తలచుచుండెడివారి కెం

20. తులసి దాసుని మాట - తూర్మమావలి బాట
యని మనసు లోపల - మననంబు లేనోని కెం

రాగం : నాదనామ క్రియ
తాళం : ఆట

68.

1. శరణు శరణు శ్రీ గురువరా - నామొరను చేకొను గురువరా
స్థిరము నందలి కోర్కెచే నిను- వేడితిని కరుణించరా
శరణు

2. పాదమంటితి గురువరా- నన్ - మోదమున కడతేర్చరా
వేదవేద్యాల కలవి గానీ -బోధయందున జేర్చరా శరణు

3. లోకమందున మునిగియుంటిని- నాకమును గుర్తెరుగక
జోక తోమత నాక మంతయు - శ్రీకరంబుగ జూపరా
శరణు

4. నీదు దరిశన భాగ్యమహిమచే - నాదు మూలము బాయెగా
పాదు లేకనె నీతో గలసిన -నీకు నాకు నభేదమే . శరణు

5. ఏక మందున తాను లేకనే -యేగతినియేలోకమో
లోక లోకములన్ని తిరగిన -శ్రీకరుండవు నీవేగా శరణు

5. ఎన్నో జన్మల నెత్తితీ - నా - కర్మఫలముల గుడువగా
పన్నుగా నిను సన్నుతించిన- కర్మఫలములు దొలగుగా
శరణు

7. రాకపోకల రమ్యమంతయు - రంకు బొంకని దేలెరా
శ్రీకరా నా పైనికరుణచే - శీఘ్రమే నను గావరా శరణు

8. జ్ఞాన అజ్ఞానంబులనె -ఆ- గాథమున బడనీయకు
దీన జనులను ఉద్ధరించెడు - ...నీవని నమ్మితీ
శరణు

9. యెల్లలోకము లందు వారల - యుల్లమున వసియించెడీ
కృష్ణ గురుడా నీదు పాదము - తులసిదాసుడు వీడడు
॥ శరణు ॥

రాగం : నాదనామక్రియ
తాళం : ఆది

59.

1. ఎఱుకమర్మము తెలుసుకొనరండీ-జనులార మీరు
ఎఱుక మరుపుల నెరుగజిప్పుండీ........... ... ॥ స ॥
ఎఱుక మర్మము తెలిసిమీరలు -ఏకముగ వుంటేనుయిలలో
జోకతోడుతనాకమంతము - "మీదు " కన్నుల ముంద
రుండును ॥ ఎఱుక ॥

2. లోకలోకము [illegible]ండండీ - యీ ఎఱుకయెన్నడు
ప్రాకటంబుగ [illegible]బోదండీ..................... ప
[illegible] - శ్రీకరుండగు గురునిగూడి
పాక[illegible] ఎఱుక[illegible] -పీకివేయగ ప్రానవలెరా
ఎఱుక

3. తల్లి దండ్రుల [illegible]నండీ - ఈ లోకమందలి
యెల్ల జీవుల[illegible]గునండీ......................
సుల్లయగు ఈలోకమం[illegible] - కల్లజీవుల నెల్లగూడిన
గుల్లయౌ యీ ఎఱుక నెన్నడు - యుల్లమందున యుండ
నివ్వకు ఎఱుక

4. పాప పుణ్యాపు వ్రాని కిదెనండీ - జనులార మీరు
కోపతాపపు మూల మెరుగండీ......................
ఓప జాలక మీరలెప్పుడు -శ్రీ పదంబులు మరచియున్నను
పాపయందలి యెఱుక యనియెడు - కూపమందున జిక్కి
పోదురు ఎఱుక

5. యెఱుక మరపుల బోధయిదె నండీ -జనులారమీరు
వెరువకను గుర్తెగురుజిమ్మండీ.........................
స్థిరము నందలి కోర్కెచేత - పరము నందలి భ్రాంతి విడిచి
కరములురముల శిరము వంచి - శరణు జేయుము
గురువరునకూ ఎఱుక

6. తత్వమూలము తానె యగునండీ - జనులారమీరే
కత్వమొందిన సాక్షియదెనండీ..................
వీక్షణంబుల సూటి గుదిరిని - సాక్షిభావం బంత
దెలియును
ఏక్షణంబున వీడకొప్పుడు - దీక్షితుడ్వైగురుని గొలువుము
ఎఱుక

7. సురల పరులా సూటియిదెనండీ - జనులార మీరు
నరుల దురులా నాణ్యమెరుగండీ..................
తపుల గిరులా ఒరుల వరులా - సూరి జనముల
చూడ్కులలరా
వరలు చుండెడి వారలందరి - మేరు శిఖరపు ధీరతిదెయగు
ఎఱుక

8. కృష్ణ దేశికు గూడి యుండండీ - జనులారా మీరు
రాక పోకల రయము మానండీ..................
వేల్పు లందరి వేడుకగునడ - తులసిదాసుడు వీడెనిడగని
వేడి నావల జాడదెలియును - కూడ్కికైనను జాడ మఱుగగు
ఎఱుక

రాగం : నాదనామ క్రియ

తాళం : ఆట

70.

నరుడా వినుము దెల్పెదా -నిజగురు బోధా
హరుడావి - నుము దెల్పెదా. ........
హరుడావినుముశ్రీ -కరమావలి గురుబోధా
వరులా నందరినీ -శ్రీకరులా జేసెడి బోధ ప

1. ప్రణవాక్షరము దెలిసియూ - ఆపై దానీ
ప్రస్థానమును - జూసియూ.............
పంచ అక్షర క్రమము నంత - సాంతముగ నెఱుగంగ జూచి
పంచ శక్తుల సారమును - గురు -యుక్తిమూలము
నెరుగవలెను. నరుడా

2. సోహం భావం బెరిగియూ -ఆపై నున్న
అధి నాయకుల గలిసియూ............
రాకపోకల రట్టునంతయు - ఏకమందున లయము జేసి
లేకదోచిన రాకపోకల -శ్రీకరుని పాదాల గలుపుము నరుడా

3. నీవెవ్వరో జూడుమూ - ఆపెనున్న
తానెవ్వరో దెలియుమూ.................................
నీకుమూలము లేనిసంగతి - వాక్యమర్మము చేతగనుగొని
భేద జ్ఞానము వదలి నీవిక-ఐక్యమొందుము గురుపదంబున
నరుడా

4. వేదంబులనూ లేదురా - నిశ్చయముగ
వాదంబులనూ లేదురా................................
మూడు దీక్షలు మూడు మాత్రలు మూడుగుణములు
ముంగి [illegible] మన
ఇడను [illegible]గళ నా [illegible]కను - సురలుమెచ్చెటి సూటి దెలియుము
నరుడా

5. సాధనంబులు జేసినా - ఆపైనెవ్వో
బోధాలందున దిరిగినా................................
బంధ త్రయముల జిక్కినీవును - ద్వంద్వ ఎఱుకను
గూడియుండిన
అందమగు నీ బోధమర్మము - ఆర్యులచె గుర్తెరుగ లేవుర
నరుడా

6. పంచభూతము లందునా ఆపై నీవు
పంచా దైవము లందునా................................
వంచనే మిము లేక నీవు -పంచ బ్రహ్మల మూల మెరిగి
పంచ శక్తుల రక్తులను ఆసక్తితో నీవు దెలియవలెరా నరుడా

7. ఆత్మ పాదము దెలిసియూ- ఆపైనీవు
బ్రహ్మ పాదము గల్సియూ..........................
జన్మ జన్మకు మూలమగు యా - జనకునీఆధారమెరిగి
శోడషాక్షరి భావమున - ఆధారమూలము నెగుర జిమ్ముము
నరుడా

8. సాధానంబును జేయుమురా -దీక్షిత నీవు
బోధామరుగును దెలియుమురా...........................
విషయ పంచక మీడినంతనె -వచనమాదులు వరుస దప్పును
ఎచట జూచిన ఏకముండెడి - అచల గురుని వచనమంటుము
' నరుడా '

9. యోగ యాగము లేలరా- దీక్షిత నీకు
రాగద్వేషము లేలరా ....................................
వర్ణవరుసన వాలిపోక - కులము గోత్రము కూట మొందక
ఆరు భ్రమలను అంటకుండియు- లీలబాసియు
నిర్మలుడవగు ' నరుడా '

10. నలువాక్యాములా దెలియుము - అపై వాటి
అనుభవమూన గలియుము ...........................
నాదు బిందు కళల దాటి - పాదు లేదని బోధ దెలిసి
శ్రీధరాదుల మేధయందలి - బోధ యందునజేరి పొమ్మర
నరుడా '

11. బట్టా బయలే శాశ్వతనూ - దీక్షిత నీవు
[illegible] ........................
[illegible] - [illegible]
[illegible] మము దివ్యపథమున
' నరుడా

2. కృష్ణా దేశికు గూడియూ-దీక్షిత నీవు
తృష్ణాలన్నియు వీడుమూ
తులసి దాసుని తోడజనినను -పలుచనగు నీ ఎఱుక నంతయు
అలుపు సొలుపును లేక నీవును - ఆదరించెటి గురుని జేరుము
నరుడా

7. లాలిపాట

1. లాలి శ్రీ కృష్ణ లాలీ - అఖిలాండకోటి బ్రహ్మాండలాలీ
మేరు నగధీర లాలీ -మమ్మేలుదొర - పరబ్రహ్మ లాలీ ప
2. వేద శాస్త్రములందునా - నిల్చినా - విభుడవూ నీవే గాదా
సాధనాలదుల చేతనూ-నిన్నే సన్నుతిజేతురంద రెపుడూ లాలి
3 ఇరువదైదును గాదుగా - మరినీవు -యిరుదెరవులను గాదుగా
బరువు బాధ్యత గాదుగా-మరినీవు -భాగవత వినుతుండవే లాలి
4. ఇంద్రాది వేల్పు - లెల్లానిన్ను - బహు సాంద్రునిగగొల్తురెపుడూ
చంద్ర సూర్యుల కంటకా - నీవెపుడు - వెలగి యుందువు
బయలువై లాలి
5. ఎఱుగు ఎఱుకయు లేదుగా - నీలోన మరుపు ఎఱుకయు
లేదుగా
ఎఱిగరిగా ఎఱుక లేని -ఉత్త పరిపూర్ణమే -నీవుగాదా లాలి
5. సాధనంబుల జిక్కవూ మరినీవు - బోధనంబుల జిక్కవూ
శ్రీధనంబున జిక్కవూ- పరమగురు - పాదసేవకుల దప్పా లాలి

7. తనువందు తనువుగావు - మరినీవు - అణువందు అణువుగావ్రా
అణువు తనువులు అన్నియు -నీలోన - అణగియుండవు నెప్పుడూ
లాలి

8. యోగ యాగములు గావు - మరినీవు -భోగ భాగ్యములు గావ్రా
రాగ ద్వేషములు గావ్రా - తన్మాత్ర రహిత రారాజువీవ్రా లాలి

9. చక్రసప్తము గావునా మరినీవు - చక్రి లిప్తము గావుగా
వక్రమార్గము గావుగా - సక్రమా - స్వాంతులకె సాధ్యంబుగా
లాలి

10. పరిపూర్ణ మిదిగో యంచు -ఎరిగరిగె -ఎఱుకయు -నీవుగాదూ
ఎఱుక మరి శూన్యమైతే -ఆపైన దేమందు నీవెగాదా లాలి

11. నిజమనిజములు గాదుగా -మరినీవు - సుజన సంగతిగాదుగా
భజన భక్తులు గాదుగా - మరినిన్ను -భావింప పరబాహ్యమే
లాలి

12. తులసి దాసుడు వేడెనూ -మీ పాదసరసిజముల్గాడెను
ఆనందముగ పాడెనూ -మీ కీర్తనాదులన్ ధన్యమనుచూ లాలి

## 72. జోలపాట

శ్రీ కృష్ణ పరమాత్మ శయనించవయ్యా
శ్రీ మించు గురు పదవి జోలపాడెదనూ జోజో

1. పంచభూతపు తను - వంచు లేదయ్యా
వంచనచె - గల్గె-నే మంచు దెల్పుదునూ

ఎంచనీకును నాకు - నడ్డొచ్చెనెరుకా
పంపి తుంచితి దాన్ని -మీమంచి బోధచే జోజో శ్రీ

2. ఏమనందును దేవ- ఏమిలేకున్ననే
నామరూపంబన్న -నేమమున బడితిని
దాముండ నీపాద - దరిశనం బాయెగా
ఏమాయెనో యంత మూలంబె లేదాయె జోజో శ్రీ

3. రామన్న సత్యంబు - రయమె దెల్పితివి
సోమన్న సూటిమరి - పొంద జేసితివి
రాకపోకల చింత -రగిలె నెఱుకందూ
శ్రీ కరుడ నీయందు - చెలగ లేవెందూ జోజో శ్రీ

4. మాయ ఎఱుకను బాయ -మంత్రించినావ్రా
దాని మూలము గోయ -తంత్రించినావ్రా
రోయుమని జగమెల్ల -సూత్రించినావు
పాయవలదని పదము - లందించినావు జోజో శ్రీ

5. తలచి వేడగ తులసి - తరియింప జేయా
నిలపైన కృష్ణుడై - విలసిల్లి నావ్రా
కల భ్రాంతులన్నిటీ - కూలంగా జేయా
ఫలమిచ్చు పాణి-మరి -నందించినావ్రా జోజో శ్రీ

రాగం : మోహన

తాళం : ఆట

## 73. మేలుకొలుపు పాటలు

మేలుకో .........ఓ మాయజీవా -మేలుకో ప

1. మేలుకొమ్మర - గురుని సన్నిధి
భావమున నీ -కతడె పెన్నిధి
కోలు కొనగను - మాయ జాలము
కీలు దెలిపెటి - గురుని పలుకున మే

2 బోధ దెలిసియు - బాధ బాసియు
శ్రీ ధనంబును - యెదను నింపియు .
శ్రీధరాదుల - మేధయందలి
వాదరహితపు - బోధలో నీవు మే

3. మూలము లేనట్టి - ఎఱుకను
ముందరుంచిన - మురిపెమేమిర
బాలునీ రీతిగ - నీవిక
గోలజేయక - గురునిపదమున మే

4. ఉన్నదే పరిపూర్ణ -మంచును
లేని దెఱుకనె-మఱుగు దెలిపెటి
కన్న గురువును -జేరి నీవిక
తిన్ననౌ గురు - సూచనలుగను మే

5. శ్రీకరంబగు - అచల బోధను
శ్రీపురంబున - ప్రాపు బెంచగ
ప్రాకటంబుగ - నీవె సరి-యే
పాటివారలు - లేరు నిల్పై మే

6. జీవ భ్రాంతియు - వదలి నీవిక
దైవమై - ధరయందు నిలువను
భావమందున -గురుని గూడిన
మోహ మంతయు-దొలగు నీవిక మే

7. ధరణిలో కొమ్మూరు - పురమున
ధాముడై వెలసిన -కృష్ణుని
నిరతమూ తన - మదిలో నమ్మిక
తలచె దాసుడు - తులసితో జన మే

రాగం : మోహన
తాళం : ఆట

## 73. మేలుకొలుపు

1. జనుల మనములు -జాగతాయెను
కనులముందరి - కల్ల బాయెను
పనులు సెల్లను -మాని పాయెను
వినుతి జేయగనూ ......... ఆత్మా మేలుకొనవే

2. జీవ భావం - బొదలి పాయెను
భావమంతయు - బ్రహ్మమాయెను
ఆవలీలవల -యనక నీవును
తోవ నడువగనూ .......... ఆ. మే

3. రాక పోకల -రమ్యమంతయు
శ్రీకరుని - పాదాల గలుపగ
ఏకమందు - ననేకమెప్పుడు
లేమి దెల్పగనూ................ ఆ. మే

4. పంచ భూతము - లేకప్పై - ప్ర
పంచమూలము - గెఱుక నిలిపెను
అంచి తంబుగ -ఎఱుక మూలము
తుంచి వేయగనూ.......... ఆ. మే

5. నీవు నేనని - నీతి నిలిపిన
తావులేనీ - ఎఱుకమూలము
చావు పుట్టుల-నొందెను నిజ
దేవు దెలియకనూ........... ఆ. మే

6. ఖండ ఖండములందు - నుండు-న
ఖండ మగు పర - బయలు జూడగ
దండిమాయను -చెండియూ గురు
నండ జేరగనూ ........... ఆ. మే

7. నేను నేననే - మాట లొలుకక
తాను గలదనే -మాట విప్పక
రానురానను -మాట సైతము
రాక నాపగనూ.......... ! ఆ. మే

8. ఉన్న దానిని - ఉండజూసగ
కన్న దానిని-కూల దోయగ
నున్న యాయీ- జగతినీ -గురు
సూటిలో నిలుపా........ ఆ. మే

9. ఎందరెన్నియో - అన్ననూ గురు
నందునే మది - ప్రీతి బెంచియు
అందు ఇందున - వన్నియును గురు
సంధిలో గలుపా.......... ఆ. మే

10. మూడి టందున -మునిగిపోకయు
ఏడి టంచున - ఎగిసిపడకయు
వీడకుండగ - గురుని పదములు
వేడగను- ఎపుడూ......... ఆ. మే

11. ఉన్న పరిపూర్ణంబు -నందున
ఉండి లేకయె - దండి గుండెడి
మిన్న కృష్ణుని - చరణముల దరి
తులసి నిలుపగనూ..... ఆ. మే

# సద్గురు -మంగళహారతులు

రాగం : అసావేరి

తాళం : ఆది

75. **హారతి**

హారతి గొనుమా - హరి-హర వినుతా వరగురుపర ప

1. మూడు ముక్క-లందునా - బోధంతయును తగముగిసి
మూఢులైన పామరుల -మౌనుల జేసిన వరుడ హా

2. నిన్నునన్ను బేధపరచె - సున్నగు ఎఱుకను విడియ
యెన్నగు రీతుల నాకు - కన్న బోధ దెల్పుగురుడ హా

3. రాకపోక లేమి లేని -శ్రీకరమౌ పదవి జూపి
నీ కరుణాల చేతనన్ను - చేకొని దరిజేర్పు వరుడ హా

4. కలదేహము వంటిదనుచు - ఇలదేహము విడిచె తులసి
వలచెను నీ పదములు-మరి-నిలచెను నీ ప్రాఁడయు నెపెడు హా

5. కర్మజాల మొదుల జేసి- మర్మమంత మరియు దెల్పి
కూర్మితోడ బ్రోచినట్టి - కృష్ణ గురుడ మంగళపర హా

రాగం : అసావేరి

తాళం : ఆది

76.

జయా - జయ మంగళం - నిత్యశుభ మంగళం
జయతు జయ మంగళం-మహోత్సవ మంగళం ప

1. నిర్వికారుండయ్యి - నిర్విశేషుండయ్యి
నిత్యుడై సత్యుడై - నిల్చు ప్రభుకూ
ఉత్త బయలయ్యి - తా - మొత్తముగ నిండిన
సత్తు చిత్తానంద - రహితున కునూ జ

2. భవ బంధముల దెంచి - బయలు భావము నింపి
అవలీవలన కుండ - అంతనిండీ
నవ ద్వారపురమందు - నాణ్యపై వెలుగొందు
అహరూప పరమాత్మ -నణచు ప్రభుకూ జ

3. మూడారు తత్వముల-మురిపెంబుగను బాపి
మూలమై యున్నట్టి - మూర్తి దెలిపీ
చాలు చాలనుచు శ్రీ - లీలలన్నియు బాపి
నీలాద్రి నావలగ-నిలుచు ప్రభుకూ జ

4. ముద్దు ముద్దుగ - ప్రీతి - సుద్దు లెన్నియో జెప్పి
వద్దనుచు ఎఱుకను - సద్దుమణచీ
నిద్దమౌ భక్తిచే - నిజగురువు గొల్వుమని
హద్దొడ్డు అచలగురు - సిద్ధునకు నూ జ

5. అంజనంబును - కనుల -కంటించి చూచి - ప్ర
భంజనంబును బోలు- ఎఱుక విడిచి
రంజనంబైన బల్ - సంధ్యావార్పులు జేసి
వింధ్యా ధీరుడు - అంజిలయ్యాకిపుడూ ॥ జ ॥

6. శ్రీశ పతి శ్రీగురు హరి, - చిద్విలాసంబంత
చిత్తాదులందునే - వెలగుననియు
వత్తి వలె తులసికి - ఉత్త బయలును జూపె
నిత్యానందుడు - కృష్ణ - ప్రభువరునకూ ॥ జ ॥

1. శ్రీకరంబుగాను - అచల - స్థిరత దెల్పు పీఠమునకు
ప్రాకటంబుగాను - పరమ - గురుకు మంగళం ॥ శ్రీ ॥

2. జనన మరణ భ్రాంతి బాపి - జన్మ రహిత మొందజేయు
పరమ గురుల పదములాకు - స్థిరము మంగళం ॥ శ్రీ ॥

3. కమలమార్గ మాంతమందు - విమలమయ్యనిలచి యున్న
అమల భావ మావలిగురు - కాడ మంగళం ॥ శ్రీ ॥

4. నిత్యుడయ్యి సత్యుడయ్యి - నిర్నిమిత్త నిత్యానందు
కృష్ణ ప్రభుని చరణములకు - కూర్మిమంగళం ॥ శ్రీ ॥

5. ఎఱుక మరుపు లెఱుక లేని - బయలను పర బ్రహ్మమునకు
తుర్యామావ లంత నున్న - తులసి మంగళం ॥ శ్రీ ॥

78.

1. మంగళ మనరే మద్గురు మూర్తికి
అంగన లందరు జతగూడి ప
పొంగెడి మది గురు - పుంగవు గొలుచుచు
సంగముకై గురు - సన్నిధి నిలచియు మం
2. కోరిన కోర్కెల - కూరిమి దీర్చెడి
కోమల రూపుని - కొలువగరే
పారంపర్యపు - భావము నిలిపిన
పారంధాముని - పర బయలని మది మం
3. ధరణిలో కోమ్మూరు - పురమున వెలసిన
ధాముని నిత్యము-దలువగరే
వర కృష్ణుండను - నామము గలిగిన
హరిహర వినుతుని- ఆత్మలో నిలిపియు మం
4. ఆత్మ నాత్మ పర - మాత్మలో గలిపెడి
సూత్రము దెలిసియు - సూటిగనూ
మేటి వరదునే - పాటున గొలిచెడి
ధీటగు తులసిని - జతగూడి మం

# అచల గురు పరంపర -మంగళహారతి

రాగం : అసావేరి
తాళం : ఆది

79.

1. శ్రీకరం బైనట్టి ఓంకార పీఠమున
ప్రాకటంబుగ హరికి భానునకునూ
ఏకముగ వెలిగేటి యాజ్ఞవల్క్యకి మరియు
జోకతో రాజ ఋషి జనక పతికి
జయ మంగళం నిత్య శుభమంగళం -జయతు జయమంగళం
సదా శుభమంగళం జయ

2. శుద్ధ తత్వజ్ఞుడౌ - శుకయోగికినినిత్య
సద్ధర్మ మార్గుడౌ -సాందీపునకూ
సిద్ధముగ పూర్ణుడౌ శ్రీకృష్ణ మూర్తికిని
వద్దికతో అర్జునా వుద్ధవులకూ జయ

3. శ్రీ మించి వెలిగేటి-శ్రీధర స్వామికిని
ధీమించు శివరామ దీక్షితులకూ
కామితార్థములిచ్చు ఘన అప్ప బ్రహ్మముకు
వేమారు శ్రీ సీతరాములకునూ జయ

4. పరి పూర్ణ బోధను - ప్రకటు పరచిన యట్టి
వర భాగవత కృష్ణ - గురునకిపుడూ
నిరతంబు పరతత్వ మెరిగించె పీల్కాణ
వర శంకర ప్రభు చరణములకూ జయ

5. భూసురా సాధ్వియగు -శేషమాంబకునిత్య
భాసురంబుగ భారలింగమునకూ
వాసిగా శ్రీ కృష్ణమాచార్యులకు నెపుడు
దాసరక్షణ సిద్ధ దేశికులకూ జయ

6. అష్టాంగ యోగములు - అన్ని మిథ్యని దెల్పి
కర్తుత్వభావంబు- కడకు ద్రుంచి
జనన మరణము లేని - పరిపూర్ణమును జూపి
కరుణించు గురు -డంజిలయ్య కిపుడూ జయ

7. కర్మ లెల్లను బాసి-నిర్మలమతి చేత
మర్మ మంతయు -దెల్పమనుచు వేద - స
ధర్మ యుతమైనట్టి - మర్మంబు దెల్పి - యా
ధర్మ మర్మము బాపు -కూర్మ - యార్యులకునూ
జయ

8. భ్రమ రూప మైనట్టి - బ్రహ్మాండ మెరుకల
భ్రాంతికి లోను - గాకుండునట్లు
పరిపూర్ణ దర్శనము - పరగ యుక్తిచే జేసి
కరుణ జూపిన - క్రిష్ణ గురున కిపుడూ జయ

9. మీకు మూలము గాక-నాకు మూలము లేక
లోక లోకము లెల్ల- యేకముగనూ
ప్రాకటంబై యున్న -పరిపూర్ణ బ్రహ్మమును
జోకతో దెలుపు గురు- పీఠమునకూ జయ

ఇతి
శ్రీమద్బ్రహ్మవిద్యాసిష్ఠ అచల బోధ
సిద్ధాంత నిర్ధారణులైన శ్రీ శివరామదీక్షిత
గురు సాంప్రదాయక శ్రీశ్రీశ్రీ సిద్ధాచల
దేశికేంద్రుల వారి ప్రియ శిష్యులైన
శ్రీశ్రీశ్రీ నిత్యానంద కృష్ణాచల ప్రభువుల
ప్రియ శిష్య రత్నంబైన

అ ప నిజానంద తులసీదాసు గారిచే ముముక్షు
జనులకు సులభోపాయముగా బోధ
యవుట కొరకై తత్వములు, కీర్తనలు,
భజనల రూపకముగా సాంప్రదాయక ధర్మ మర్మములు
దెలుపు "అచల గురు మార్గము" అను నీ పుస్తకము రచింపబడి
సద్గురు పాదపద్మముల చెంత పూజా పుష్పమై నిల్చినది.
ఇయ్యది సద్గురార్పణ మస్తు
సర్వం సద్గురువరగార నిందార్పణ మస్తు.



# ఓం
# శ్రీ నిత్యానంద కుర్మాచల ప్రభు విరచిత తత్వ కీర్తనలు :-

I. నాగురుడు నన్నింక వేగ రమ్మనెనే
వేగ రమ్మనె రాజయోగి గమ్మనెనే ప

1. ఐదు తత్వంబుల - అంతూగనుమనెనే
ఐదు ఐదుల ఇరువై ఐదు - మేననెనే నా

2. మూడు నాల్గుల దాన్ని ముందు గనుమనెనే
కని నాల్గునాల్గుల దాన్ని వదలుండుమనెనే నా

3. నేను మేనులు గాని దాన్ని - యెరిగుండుమనెనే
యెరిగుంటె నీ జన్మ విడిపింతు ననెనే నా

4. దీక్ష బొందిన వారి - దిక్కు నేననె
కక్షాశాయక వార్ని - రక్షింతు ననెనే నా

5. ఆది అంత్యము గాని - దరుగో చూడనెనే
మస్తకంబున హస్తమిడి -నను మటుమాయముజేసెనే నా

6. స్వర్గబాన్ పేటకు - సరగున రమ్మనెనే
సంతసంబును బాపి-సవరింతు ననేనే నా

7. కూర్చుండి వేగ -కూర్మయ్యా వినుమనెనే
సిద్ధాగురుని కృప - సిద్ధించు ననెనే నా

2. గురుదేవ -గురుదేవా . గురుదేవా - మహానుభావా ప

1. గురుదేవా నీ మరుగు జేరితిని
అరమర సేయక సరగున బ్రోవుము గు

2. తల్లి దండ్రిగురు -దాతదైవమని
యెల్ల యెడల మది -నమ్మి భజించితి గు

3. అందు యిందు అనరాక సూదికోన
మోప సందు లేకుండ నిండినవు గు

4. స్థిరము జూపి - అస్థిరము బాపి నా
వెతలు బాపి - సద్గతి నొసంగినవు గు

5. అండ పిండ బ్రహ్మాండ మంతటను
నిండియున్న - అఖండ రూప జై గు

6. సర్దార్ఖాన్ పేట నివాస - గురు భక్తపోష
సిద్ధరామ మహాప్రభో గు

7. దోష రహిత నిర్దోషియు - కుర్మా
దాసుని బ్రోవుము - దేశిక ప్రభో గు

3. సంధీ దెల్పగ రావయ్యా - సద్గురు దేవా
సంధీ దెల్పగ రావయ్యా ప

1. అందముగా నిన్ను - ముందూ పూజించెద

ఆదారించగ రావయ్యా - హరిగురు దేవా
నిజమూ దెల్పగ రావయ్యా సం

2. ముదముతో ద్వాదశి - ముందుగ నెరగించి
పదపడి శోడశిది పద్ధతి దెల్ప సం

3. భక్తాకోటులు నిన్ను - భజన జేయుచువేడ
ముక్తి నివ్వగ రావయ్యా మునిజన పోషా సం

4. సర్జాఖాన్ పేటలో - సంతాసిల్లుచు నుండి
సజ్జన సంరక్షక - దుర్జన శిక్షా సం

5. సిద్ధేశ్వర గురుస్వామి - శీఘ్రమే రక్షించి
కుర్మయ్యా నేలవయ్యా - కూరిమి తోడ సం

4.

1. ధ్యాసా జేసితి దేశిక - మీనామమూ
దోసిల్యొగ్గితి మీ పాద - సేవనమూ ప

2. హరిహరా బ్రహ్మాది - సురులునీనామము
స్మరణ జేసి తరించిరి - పావనమూ ధ్యా

3. రావ నిజగురు -దేవానిను స్మరియించితీ
ఈ సుజనా సంఘమునెల్లా దీవించుమా ధ్యా

4. దేవా రెండు అర్ణనువుండు జూపినవ్వా
జూపి రెండు ఎనిమిదులఖంటడించినవు ధ్యా

5. సర్జాఖాన్ పేటలో -నివసించినవ్వా
గురు సిద్ధేశ్వరుడవై - నిలచినవ్వా ధ్యా

6. ఇందు రార కుర్మయ్యా -యని పిలిచినవ్వూ
ముందు జన్మా లేదనే -సంధి దెల్పినవ్వూ ధ్యా

**5.**

1. ఎందుకని -నను బ్రోవవు ! యిందిరామనోనాయకా
అందము తోడ నిన్ను -ముందుభజియింతు దేవా ఎందు

2. ఘనముగ గజరాజు - దప్పిగొని నీరు ద్రావ
మకరిపాదము బట్టు - శిరము ద్రుంచిన దేవా ఎం

3. సవతి తల్లి బాధలచే -బాలుడు ధ్రువుడేడ్వగ
కనికరమున వాన్ని - కాచి బ్రోవగ లేదా ఎం

4. భక్తుడా కుచేలుని - భార్యబిడ్డలు మిము
ఆకలని యేడువగా - ఐశ్వర్యామివ్వగ లేదా ఎం

5. భక్తుడౌ ప్రహ్లాదుని - జనకుడూ శిక్షించగా
కుమారుని నేలీ - తండ్రినిచీల్చివైచిన దేవా ఎం

6. సభలో దుశ్శాసనుడు - ద్రౌపదీ చీరుడువగా
హాకృష్ణా యని వేడా - వలువలివ్వగ లేదా ఎం

7. భక్తుడౌ గౌతాముని -భార్యను శిలగా జేయ
శిలపై పాదమిడీ -స్త్రీని జేయగ లేదా ఎం

8. సనక సనందన - నారదాదులు నిదు
నామము దలువగ -నయముగ బ్రోవగలేదా ఎం

9. ధరణిలో బుద్ధావరం - భక్తులు మిము
దోసి లొగ్గిన కుర్మాదాసు - నేలగ రావ ఎం

0.

1. పండరి నాథా - ఓ పాండురంగా
మము నిండు ప్రేమతో బ్రోవ రా పాండరంగా
శ్రీ పాండు రంగా పండ

2. సక్కు భాయినేలినట్టి - సదయుడవు
దిక్కు లేని దీనుల బ్రోచే - ధీరుడవు
సుహిాదుడవా - సుకుమారుడవా
మముకావవే - బ్రోవవే -శ్రీపాండురంగా పం

3. పుండరీకుని భక్తికి మెచ్చితివి
పండరిలో యిటుక రాతిపై నిలచితివి
దేవదేవుడవా -దీనపాలుడవా
యీ ఆర్తుని మొరవిని - ఆదరించుము ఓ పాండురంగా
పం

4. రంగు రంగైన జెండాలు- చేపట్టిమి
కాళ్ళ గజ్జెలు కరతాళం మ్రోగిస్తిమి
పాండు రంగా యని - పరమేశాయని
ఆడుచు పాడుచు -వేడెద దేవా పం

భక్తిచే మేము పండరి - జేరొస్తిమి
ᐧᐧ ద భాగ నదిలో స్నానమునుజేస్తిమి

తులసీ దళములను త్వష్ణదీరగనూ
నీపాదములపై నిడి సేవ జేసెద దేవా " పం

5. ధరణిలోపల శ్రీ బుద్ధవరమందునన్
నిలచి నీసేవ జేసెద నిరతంబును
నాదురితంబులన్ -ధ్వంసము గావించియు
దోసిలొగ్గిన కుర్మా -దాసుని నేలుము పం

## 7. మంగళ హారతి

మంగళామనరే - మద్గురునాకు మంగళా మనరె
1. మంగళామనరే - మీ రంగాణులును గూడి
పొంగుచు శ్రీ గురు పాద పద్మములాకు మంగ
2. అన్నా యీ లేనరెరుక - యెన్నాడు లేదాని
ఉన్నా నిజమును - జూపె ననుగన్న నా తండ్రికి మంగ
3. శ్రీధర శివరామ దీక్షిత - అప్ప బ్రహ్మ
పరశురామ సీతారామా దేశికులాకు మంగ
4. శేషమాంబ భారదేశికేంద్రులకు
ధరణి హెూముల పురివర కృష్ణమూర్తికి మంగ
5. సర్దార్ఖాన్ పేటలో నిరతము నివసించే
పరమ భక్తుల నేలే పరమ సిద్ధయ్యకు మంగ

దాస దాసుల కెల్ల -దాసుడయ్యన కూర్మ
దాసు నేలినట్టి -దాస పోషణునకు మంగ

# అచలగురు అంజిలయ్య స్వామి ప్రియ శిష్యులైన నరసయ్యదాసు

'బుద్ధారము' గారి విరచితము

మంగళం జయ మంగళం -శుభ మంగళం సిద్ధ గురువరా
వీరమాంబ సమేత గురువర - ఉభయులకు శుభమంగళం
రెండు ఆరులు ఉండజూపిన - రతనముల శిఖరంబువే
ఉంద జూపి దండి మాయను - ఖండించిన గురువర
మంగ

నీదు కరుణకు పాత్రుడు -నిజము దెలిసిన భక్తుడు
అంజిలయ్యకుసేవజేసిన - నరసయ్య దాసుడు మంగ
అండజేరిన భక్తులను -ఆదరించినగురువర
ఆదరించి అభయమిచ్చి - ఆజ్ఞయిచ్చిన గురువర మంగ
మంగళ మనరే - సద్గురుమూర్తి పంగావు గానరే ప

ముందుగ మనమంత పొందుంగ వేంచేసి
తను మనధనములను - తనివిదీరగ నిచ్చి మంగ
పుడమిలో గుముడాల పురమందు నెలకొన్న
అంజిలయ్య స్వామి- ఆదరించుము మమ్ము మంగ
హంస వాహన మెక్కి - అంతరంగము నందు

పంతాము లాడెటి -యా పరంజ్యోతికి మంగ

4. అంజిలయ్యా స్వామినా - చెంతాకు రమ్మని
సంక జేర్చుక మా శంకబాపిన స్వామి మంగ
5. పుడమిలో గూడెము - పురమందు నెలకొన్న
నరసయ్యా దాసుడు నయముతో జేసెను మంగ
3. మంగళమని మంగళమని మంగళమనరే
మన అంజిలయ్య గురువరునకు మంగళమనరే ప

1. సత్తు చిత్తు వదలి నిర్మల చిత్తుని గనరే
వత్తిలేని జ్యోతియే మంగళమనరే మంగ
2. ద్వాదశి యే దండిదని ఉండజూడర
మూలమేమి లేని దేహి మంగళమనరే మంగ
3. ధరణిలో బుద్దారపురము - వట్టిదెయనర
తనయుడు నరసయ్య దాసు - మంగళమనరే మంగ

సర్వం సద్గురు చరణార విందర్ప ణ మస్తు

గ్రంథము ముద్రణకు- సహకరించిన దాతలు రూ॥లు

శ్రీ దయానంద నాగుల వేంకటేశం- గొల్లగూడెం 16
అచల ఋషి పద్మమ్మ- బుద్ధారం 5 6
శ్రీమతి బసమ్మ నుపూర్ 516
శ్రీ శోభాసమేత రాగారిఅంజిలయ్య - జక్లపల్లి - 1116
శ్రీ హన్మంతు రెడ్డి - పెద్ద జట్రం 116
విమలానంద బుచ్చన్న - బుద్ధారం 116
నిర్గుణానంద బంగారు వీరన్న - జక్లపల్లి 116
శ్రీ కోట్ల బుచ్చిరెడ్డి - జక్లపల్లి 116
శ్రీ చంద్ర మౌళి - జక్లపల్లి 51
శ్రీ రవీందర్ రెడ్డి - జక్లపల్లి 116
శ్రీ జైపాల్ రెడ్డి - జక్లపల్లి 116
శ్రీ రఘుపతి రెడ్డి - జక్లపల్లి 51
శ్రీ కృష్ణారెడ్డి - జక్లపల్లి 51
శ్రీ రుక్మారెడ్డి - జక్లపల్లి 51
శ్రీ కమ్మరి పుల్లప్పచారి - వెన్నాచేడ్ 51
శ్రీ సి.నరేందర్ - టీచర్ ‥ 250
శ్రీ జి.నారాయణరెడ్డి టీచర్ ‥ 116
శ్రీ జి.రాములుగౌడ్ ‥ 116
శ్రీ శివ మల్లప్ప- ఆధ్యాత్మికులు ‥ 116
శ్రీ సాయిబన్న గౌడ్ ‥ 51
శ్రీ బాలనర్సిములు ‥ 51
శ్రీ ఎల్. మాసన్నగౌడు ‥ 116
శ్రీ కె.నర్సప్ప
శుభరాస్వాడియో MBNR ‥ 51
నర్సిములు కేశ్వాపూరు 51
అచలానంద వేంకటయ్య వేపూరు 51
శ్రీ సొప్పరి అంజిలయ్య నంచర్ల 116
శ్రీ ఆవుల వేంకటయ్య కోస్గి 500
శ్రీ వేంకటేశం మంచన్‌పల్లి 51
శ్రీ ప్రకాశ్‌రావు బెన్నూరు 116
శ్రీ శైల చంద్రారెడ్డి ‥ 51
శ్రీ విజయ్ కుమార్‌దేశ్‌ముఖ్ ‥ 51
శ్రీ ముకుందరెడ్డి దేశ్‌ముఖ్ ‥ 51
శ్రీ ద్యాగ పెద్ద మల్కయ్య కుస్మసముద్రం 216
శ్రీ బచ్చిలి అంజిలయ్య ‥ 116
శ్రీ బాల్‌రెడ్డి జక్కేపల్లి 116
శ్రీ గుండ్లకుంట బసప్ప ‥ 100
శ్రీ తలారి సాయప్ప ‥ 100
శ్రీ కుమ్మరి లాలప్ప ‥ 100
శ్రీ కుమ్మరి యెల్లప్ప ‥ 100
శ్రీ బసప్ప ‥ 51
శ్రీ రావుల వెంకటయ్య ‥ 51
శ్రీ ఊరడి భీమప్ప ‥ 51
శ్రీ కుర్వ మల్కప్ప ‥ 51
శ్రీ అవుల చంద్రయ్య ‥ 51
శ్రీ సాకలి లాలప్ప ‥ 51
శ్రీ బొల్లె లాలప్ప ‥ 51
శ్రీ ఉప్పరి శ్యామప్ప ‥ 51
శ్రీ నర్సిరెడ్డి ‥ 51
శ్రీ యన్.బసయ్య ‥ 51
శ్రీ గోంద్రమొగులప్ప ‥ 51
అచలానంద రామదాసు- మల్కాపూరం 116
పూర్ణానంద కాళిదాస్ ‥ 116
శ్రీ బాల్‌రెడ్డి ‥ 51

| | | |
|---|---|---|
| శ్రీ చందునాయక్ | " | 5 |
| రాములు | కేశ్వాపూర్ | 116 |
| నర్సింహాచారి | " | 116 |
| శ్రీ బీరప్ప | " | 51 |
| శ్రీ సత్యన్న | " | 51 |
| శ్రీ కుర్వ నర్సిములు | " | 51 |
| శ్రీ రాము నాయక్ | " | 51 |
| శ్రీ దయానంద కృష్ణదాసు | రాంపూరు | 116 |
| శ్రీ బాల్‌రెడ్డి | " | 116 |
| శ్రీ గొల్ల కిష్టన్న | " | 51 |
| శ్రీ దోడ్యా నాయక్ | కేశ్వాపూర్ | 116 |
| శ్రీ పెద్ద బుగ్గన్న | మల్కాపూర్ | 5 |
| శ్రీ లింగప్ప | " | 51 |
| శ్రీ డి. రాములు | " | 51 |
| శ్రీ ఆశన్న గౌడు | పాల్‌పల్లి | 51 |
| శ్రీ నారాయణ గౌడు | " | 51 |
| శ్రీ అంజిలయ్య గౌడు | " | 51 |
| శ్రీ మల్లి కార్జున్ | " | 51 |
| శ్రీ పల్లహన్మయ్య గౌడు | నారాయణపేట | 116 |
| శ్రీ వెంకటరెడ్డి | " | 1_6 |
| శ్రీ పాసిరెడ్డి | చంద్రవార | 116 |
| శ్రీ మతి పాసమ్మ | " | 6 |
| శ్రీ కమ్మరి బుచ్చప్ప | వేపూరు | 116 |
| శ్రీ [illegible] | " | 51 |
| శ్రీ భీంరెడ్డి | ఉడ్యాల్ | 51 |
| శ్రీ కాళప్పా చారి | " | 51 |
| నిజానంద బస్వరాజ్ | వల్లాపూర్ | 116 |
| శ్రీ సర్వప్ప [illegible] | [illegible] | 116 |
| నిరంజనమ్మ | పరిగి | 116 |
| శ్రీ కమ్మరి మాణెప్ప టీచర్ | సుల్తాన్‌పూర్ | 16 |
| శ్రీ మల్‌రెడ్డి | " | 51 |
| దాసానంద బ్రహ్మానందవారి | బడెంపల్లి | 6 |
| శ్రీ శ్రీనివాస్-డాక్టర్ | వనపర్తి | 51 |
| శ్రీ బిచ్చన్న | మోత్కూర్ | 51 |
| శ్రీ కె. బాలయ్య టీచర్ | మహమ్మదాబాదు | 5 |
| శ్రీ కొత్తూరు మల్కయ్య | మల్కాపురం | 6 |
| శ్రీ యమ్. చిన్నరామయ్య | అనంతసాగర్ | 5 |
| శ్రీ యమ్. రాములు | గాడ్డిల్ | 51 |
| శ్రీ బాలప్ప | గండీడ్ | 51 |
| శ్రీ జి. రాములు - టీచర్ | దౌల్తాబాదు | 6 |
| సమరసానందనారాయణ | హన్వాడ | 51 |
| అచలానంద యెర్రన్న | సల్లోనిపల్లి | 51 |
| శ్రీ శశి కుమార్ | చోడవరం | 116 |
| పూజారి హన్మయ్య | మంగంపేట | 51 |
| శ్రీ ఎస్. గోపాల్ | గాడ్డిరాల్ | 51 |
| శ్రీ దోమనర్సిములు | వెన్నాచేడ్ | 116 |
| శ్రీ జి. లక్ష్మయ్య | హైద్రాబాద్ | 216 |
| శ్రీ వడ్లకృష్ణయ్య | MBNR | 116 |
| శ్రీ రాములు నాయక్ | MBNR | 51 |
| శ్రీ గొల్ల బుచ్చన్న | హన్వాడ | 51 |
| శ్రీ కె. దామోదరాచారి | కుస్మసముద్రం | [illegible] |
| శ్రీ మతి హైమవతి | " | 5 |
| సమరసానంద తిరుపతయ్య | " | 116 |
| శ్రీ చెన్నకేశవులు | లాల్‌కోట | 116 |
| శ్రీ రామకృష్ణ | గుడిబండ | 116 |
| శ్రీ రాయప్ప | బుద్ధారం | 51 |
| శ్రీ కొప్పు వెంకటయ్య | గుండాల | 116 |
| శ్రీ రాంచంద్రయ్య | అంతిరెడ్డిగూడెం | 5 |

| | | |
|---|---|---|
| శ్రీ అనంత్‌రెడ్డి | హన్వాడ | 51 |
| శ్రీ బంటు చిన్నరాజన్న | కొమ్మూరు | 51 |
| శ్రీ శేషప్ప | '' | 51 |
| శ్రీ తిమ్మన్న | '' | 51 |
| శ్రీ కర్రె బసన్న | '' | 51 |
| శ్రీ కీర్యానాయక్ | మల్కాపూర్ | 51 |
| శ్రీ టీక్యానాయక్ | '' | 51 |
| శ్రీ మున్యానాయక్ | జమ్లాపూర్ | 51 |
| శ్రీ కుర్వ చంద్రప్ప | మల్కాపూర్ | 51 |
| శ్రీ పెద్ద బాలప్ప | రాంపూరు | 51 |
| శ్రీ ఆంజనేయులు | గాడ్దిల్ | 51 |
| శ్రీ నర్సింహారెడ్డి | కొండాపూరు | 151 |
| శ్రీ అ మాది రాజలింగం | వికారాబాద్ | 116 |



అ ప రాగారి అంజిలయ్య - జక్లపల్లి - 116

| | | |
|---|---|---|
| రామజీ నాయక్ | జిన్నారంతండ | 116 |
| సోమ్లనాయక్ | '' | 116 |
| శంకర్ (డ్రైవర్) | తండూరు | 51 |